భారతీ మండలి—౧.

# తాజ్ మహల్

* *

*

సో॥ రామానుజరావు.

అంకితము,
రసజ్ఞులగు పాఠకులకు:

## తొలిమాట—

పెద్దవాడైన కుమారుని ప్రౌఢవాక్యములకు మనమందు నానందమునకన్న, వచ్చీయురాని, బాలుర మాటలను విని, యధికానందము నందుచున్నాము. అటులనే, ప్రౌఢకవుల. ప్రబంధాదికములకు మీరందు నానందమున విశేషము లేదు, నేను వ్రాసిన యీ తాజ్‌మహాలు నందలి వ్రాతలకు—రసజ్ఞులు— బాలుర పలుకులంబోలె నానందించి, మన్నింప ప్రార్థించుచున్నాను—చరిత్రకారులు విమర్శక దృష్టింబరుప వేడెద— లాక్షణికులకొక నమస్కారము — భావగ్రాహులకు స్వాగతము.—

గ్రంథకర్త.

[illegible] మూర్తి

# పాత్రలు.

షాజహాన్ — ఢిల్లీశ్వరుఁడు.

దారా — అతని పెద్దకొడుకు; యువరాజు.

షుజా — అతని రెండవకుమారుఁడు.

ఔరంగజేబు—,, మూఁడవ ,,

మురాదు— ,, నాల్గవ ,,

సాదతుఖాను — ఒకగాయకుఁడు

జేడా — విశ్వాసపాత్రుఁడగు నీగ్రో.

న్యూటన్ — ఫ్రెంచిఫాద్రీ.

గోవిందదాస్ — హిందూ పండితుఁడు.

జమాదార్ — ఒకపంజాబీ.

మసాకత్ — షుజా నౌకరు.

కొత్వాలు.

ఖాజీ.

వైద్యుఁడు.

దనసింగ్.

☞ మఱికొందఱు భటులు మొ॥.

జహనారా — షాజహాన్ పెద్దకూతురు.

రోషనారా — ,, రెండవ ,,

మంతాజ్ మహల్ — షాజహాన్ భార్య.

ఆష్ర[illegible] — దారా ప్రియురాలు.

[illegible]

20 — 33

# తాజ్ మహాల్.

## ప్రథమాఙ్కమ్.

### దృశ్యము—౧.

ప్రదేశము—ఔరంగజేబు మందిరము.

ప్రవేశము—ఔరంగజేబు—రోషనారా.

సమయము—(ప్రాతఃకాలము.)

ఔరం—(ఖురాను ముందుంచుకొని) సోదరీ! నీవు చెప్పిన మాట నిజమే; కాని, నాకెందుచేతనో—ఐహికమునం దిచ్ఛలేదు. ఎవ్వఁడు ప్రకృతిపాశములచే బలవత్తరముగ బంధింపఁబడునో—వాఁడు పరమును సాధింపలేఁడని ఖురానునిర్వచించుచున్నది.

రోష—ఇట్లని నీవు ఫకీరువౌదువా? సోదరా!

ఔరం—కావలసినయెడల నట్లే-

రోష—సమంజసముకాదు;-సంసారమందు తరుణోపాయము లేదా!

ఔరం—అది కడుదూరపుమాట; సంసారమునంజిక్కువడిన వారు తరించుట కెంతటిమనోనైశ్చల్యము కావలయును.

రోష—(స్వ) ఇతని చిత్తవృత్తి పూర్ణముగఁ దెలియదయ్యె కాసిమ్మ; ఇప్పటికిప్రస్తావన మాన్పెదను (ప్ర) సోదరా! అక్క సంగతి వింటివా?

జొరం—ఎవరు? మన జహానారా. సంగతియా? విశేషమే మైన నున్నదా యేమి?

రోష—అంతయు విశేషమే! నీవేమియు విచారించుట లేదు. ఖురాను చదువుకొనుచు నీవీయిల్లు కదలవు.

జొరం—(స్వగ) వెఱ్ఱిదానా! ఈయిల్లు కదలకుండగనే నాక న్నిసంగతులును తెలియుచున్నవి (ప్రకా) అమ్మా! ఈ లోకాభిరామాయణము నాకెందులకు?

రోష—అక్కకు సంగీతముచెప్ప సాదతుఖాను హిందూ ప్రబంధములలోని బిల్హణుఁడైనాఁడు.

జొరం—ఆఁ! ఆఁ! అంతపని చేసినాఁడా? అనుకొన్నంత యై నదిసుమా?

రోష—నిన్నటి యుదయమున, అక్క సంగీతశాలలో నకస్మాత్తుగ సంగీతమాగిపోవ, నేనక్కతో మాటలాడుదమని ప్రక్కగదిలోనుండి తటాలునఁ దలుపులుద్రోసికొని లోపలకుఁ బోయితిని.

జొరం—తరువాత!

రోష—పోయిచూచుచుండగదా—సాదతుఖాను, అక్క మొగ ముపై మొగముంచి—

జొరం—(కోపముతో) ఏమి? సంగీతము చెప్పకొని పొట్ట బోసుకొనుచున్న నీచుఁడగు సాదతుఖానేమి? రాజపుత్రికపై స్వతంత్రతమేమి? వానికి బుద్ధిలేకున్న నీకండకుమతి లేదా? కామవికారము, కనులకు బాగుగ నెగదట్టినది

కాఁబోలును............ఘోషా! చక్రవర్తి గ్రుడ్డివాఁడై యుండెనా?

ఘోష—సావకాశముగ నంతయు వినుము,

ఔరం—చెప్పు! చెప్పు! పిదప నేమి జరిగినది?

ఘోష—నేను లోపలకుఁ బోవునప్పటికి పిరికివాఁడగు సాదతు ఖాను భయపడి తలవెనుకకుఁ దీసికొనెను. కాని, సమయానుకూల చతురయు జగజంతయునగు జహనారా చేసిన తెలివితక్కువ తనమును గ్రహించుకొనఁ దలఁచి—చూచి చూడని చందమునఁ జూచి—„సాదత్! మా చెల్లెలే! మరెవ్వరును లేరు! ఇంకకొంచెము లాగిచూచితివా చెవిసీల వచ్చును". అనిపలుక, నాయెదుటనే-యా దురాత్ముఁడు జహనారామాటల యందలి సాక్షి నెఱిఁగి తననోటితో, చెవినున్నయాభరణపుసీలను లాగి-„అన్నా! సెల" వని పలికి నాకుఁగూడ నొకసలాముచేసి చితారు భుజమున వైచుకొని యింటికరిగినాఁడు.

ఔరం—ఎంతసాహస మెంతసాహసము!

ఘోష—అంతట-జహనారా దుద్దుశీల త్రిప్పుకొనుచుఁ చెల్లెలా! కూరుచుండు మని నన్నుమర్యాదచేసి తనయకార్యమునకు నేను సంశయింపకుండ „సోదరీ! చెవితుద్దురాక నొప్పిజేసినది. నీవద్దనేదయిన పైనమర్దింపఁదగిన మందు గలదేని పంపుదువే? యని యడిగెను.

ఔరం—జగజంత—

రోష—ఆమందు సైతము సాదతుఖానే పెట్టవలయు నావ లననేమగు," నని పలికి చిఱునవ్వునవ్వి, నేను నామందిర మునకుఁ బోయితిని.

ఔరం—ఇంతపని జఱుగగా—రోషన్!—నీవు దీనినేల చక్ర వర్తి కెఱిఁగింపలేదు.

రోష—ఎఱిగించుట కవకాశమెక్కడనున్నది? నేను నాయన గారి దగ్గఱకుఁబోవునప్పటికి-జహానారా తండ్రిగారి సమీ పమునను్న కవాచిపైఁగూరుచుండి, తనయెదుటఁ నిలు వఁబడియున్న రాజవైద్యునకు జెవింజూపుచు—నేదియో మందు రాయించుకొనుచు, నేనరుగునప్పటికి-తండ్రిగారికి నన్నుఁజూపి,-"మన రోషన్కూడ చూచినది; అదుగుఁడు-సాదతుఖాను దీనిని లాగుటకెంత కష్టపడినాఁడో!" అని చెప్పినది. ఇట్టి సమయమున, నా నివేదన నిష్ఫలమని యెఱిఁగి మరలిపోయితిని.

ఔరం—టక్కరి బాగుగ క్రమ్ముకొన్నది.

రోష—రంకు నేర్చినది, బొంకు నేర్వకుండునా?

ఔరం—సరి! రోషన్! నీవిప్పటికిఁబొమ్ము. నేను దానిసంగతి నాలోచించెదను.

రోష—తమ్ముఁడూ! జనానాలో నిట్టి దోహములను జఱు గనిచ్చినయెడల మనకుమిగుల నప్రతిష్ఠ కలుగును.

ఔరం—ఔను; నీవిఁకఁబొమ్ము. సాదతుఖాను పనియైనదిలే.

రోష—(స్వగ) ఔరంగజేబు విరాగియా?-విరాగియో సరా గియో తెలిసిపోయినది! ఇది కపటము-ఐనను తన శ్రేయ

మున్గోరిన నాయెడల తనకీ దాపరికమేల?............
ఉన్నవిషయాన్ని, లేనివిషయాన్ని-చెప్పి, జహానారా మరియా
దను నడువీధికెక్కించితిని. ఇఁక సాదతుఖాను నాకెట్లు
లభింపఁడో చూచెదను.

(ప్రస్థానము.)

ఔరా—ఔరా! రాజాంతఃపురముల గతి!

(తెరవాలును)

దృశ్యము—౨.

ప్రదేశము:—షాజహాన్ ఉద్యానవనము.

ప్రవేశము:—షాజహాన్ — ముంతాజ్ మహల్

సమయము:— సాయంకాలము.

షాజ—ప్యారీ! ముంతాజ్!—

ముంతా—మహారాజా!

షాజ—శిరోబాధ నివారించు తైలమును దెప్పింపుము.

ముంతా—(ఉలికిపడి) ఏమి! తమకు శిరోబాధగనున్నదా?—

షాజ—అందువలననే అభియోగములకు తీర్పుచెప్పకుండ, సభనుండి లేచి వచ్చితిని.

ముంతా—తెప్పింపనేల! తైలమును నేనే తెచ్చెదను.

(ప్రస్థానము.)

షాజ—అబ్బ! శిరోబాధ విశేషముగనున్నదే!—నిన్న రాత్రి స్వప్నము వచ్చినప్పటి నుండియు మనస్సుకలతగనే యున్నది. తరువాత, షుజా విశేషముగ మద్యమునుసేవించి వేశ్యాగృహమునఁ బడియుండెనను వార్తను సాదుల్లా చెప్పినతరువాత, శిరోబాధ ప్రారంభమయ్యెను.....,.... ......అబ్బబ్బ! ఎక్కడిదీ సంగీతము. నిలిపివేసిన బాగుండును.

ముంతా—(ప్ర॥-తైలమును శరీరమునకు మర్దించుచు) రాజకార్యములయందు విశేషముగ మగ్నులైతిరికాఁబోలు?—వజీరులందరు నేమిసేయుచుండిరి! మీరింత శ్రమపడనేల!

షాజ—ఆసంగీత మెక్కడిది?

ముంతా—మనరోషన్ తనవిలాస మందిరమున పాడుకొను చున్నది. ఈసంగీతము మీకు కొంచెము మనశ్శాంతినిచ్చునేమో!—వినుడు సారంగరాగము నాలాపించుచున్నది!

షాజ—ఆసంగీతమునకు నామనస్సు కడుచికాకు పడు చున్నది.

ముంతా—నిలిపి వేయుమందునా?

షాజ—అటులయిన కొంతసేపు శాంతముగనుందును.

ముంతా—లైలా—

(దాసి—ప్రవేశము.)

దాసి—మహారాజ్ఞీ!—

ముంతా—తండ్రిగారి సెలవైనదని వారికి శిరోబాధగనున్నదని చెప్పి మనరోషనారా బీగమును సంగీతము నిలుపు మనుము.

లైలా—భాగ్యము-(పోబోవును)

షాజ—లైలా—

లైలా—మహారాజా!

షాజ—అట్లు చెప్పినచో నా బాలికయుత్సాహామునకు భంగముకలుగును; కనుక-నేనొకమారు రమ్మంటినను ము.

లైలా—చిత్తము. (ప్రస్థానము)

ముంతా—గాలి కొంచెము మందగించినది.

(విసరుచున్నది)

షాజ—ప్యారీ!

ముంతా—మహాప్రభూ!

షాజ—(చిరునవ్వుతో) రోషనారా సంగీతము పాడుచు
న్నదా? ఎప్పటినుండి?

ముంతా—ఈనడుమనే ప్రారంభించినది.

షాజ—ఏమి సంగీతమిది! -జహానారానుచూచి-పంతమునకు
మొదలుపెట్టినది!

ముంతా—జహానారా కంఠస్వరము ప్రశస్తమైనది.

షాజ—ఎక్కడిజహాన్-ఎక్కడిరోషన్-హస్తిమశకాంతరము!

ముంతా—అదుగో! రోషనారా—

(రోషనారా ప్ర॥)

రోష—జహాపనా!

షాజ—బిడ్డా! ఇటువచ్చి కూర్చుండుము.

రోష—తమకు శిరోబాధగనున్నదట!

షాజ—ఔను. నేడేలనో శరీరమున తిన్నగలేదు...........
నీసంగీతమును మాన్పించితిని.

రోష—దానికేమి? తమ మనమున సంతోషముగనుండ
వలెనుగాని—

షాజ—బిడ్డా! నీవును సంగీతము నభ్యసించుచుంటివా?

రోష—ఔను.

షాజ—ఎవరివద్ద—

రోష—సాదతుభాను—

షాజ—ఇంకను నూతనముగనున్నది.

ముంతా—ప్రారంభించిన యెంత మేది?

షాజ—ఎన్నినాళ్లైనది?

రోష—ఒక వారమైనది.

షాజ—ముంతాజ్!-మన రోషనారా కంఠము సహితము మంచిదే! అభ్యాస క్రమమున జహానారావలెనే పాడం గలదు.

ముంతా—చిత్రము..........తమకు శైలమువలన నిప్పుడు కొంచెము సుగుణమైనట్లున్నది.

షాజ—బయటిబాధ తగ్గినదిగాని, లోపలిబాధ తగ్గలేదు.

ముంతా—లోపలిబాధయేమి?

షాజ—గతరాత్రి నేనొక పాడు కలగంటిని.

ముంతా—అయ్యో! అదియెట్టిది?

షాజ—చెప్పెదను-తొలుత ఖాజీసాహెబునకు కబురంపవలెను.

ముంతా—శైలా—

శైల—(ప్ర॥) మహారాజ్ఞీ!—

ముంతా—చక్రవర్తిగారి సెలవైనదని ఖాజీసాహెబును పిలిపింపుము.

శైల—భాగ్యము—(ప్రస్థానము)

ముంతా—ఔను. తమరు రెండుజాములు దాటినతరువాత రాత్రియొక మారులికిపడితిరి! నేనుచూచియు నిద్రాభంగమగునని మేలుకొలుపనైతిని; అదిమిగుల భయానకమై యుండును గాంబోలును.

రోష—అదుగో—మన శైలా—ఖాజీసాహెబును వెంటబెట్టుకొని వచ్చుచున్నది!

షాజ — సరే! స్వప్నవృత్తాంతము ఖాజీవచ్చిన తరువాతనే చెప్పెదను.

(తరువాత ఖాజీ—శైలా ప్ర॥)

షాజ—ఖాజీ మహారాజ్! నమస్కారము.

ఖాజీ—మహారాజా! నీకు శుభమగును.

షాజ—పీఠ మలంకరింపుండు.

ఖాజీ—(కూర్చుండును.)

షాజ—క్రిందటిరాత్రి నాకొక దుస్స్వప్నము వచ్చినది. దాని ఫలమును తెలిసికొనుటకై తమ్ముం బిలిపించితిని.

ఖాజీ—స్వప్న స్వరూప మేమి?

షాజ—అగాధమగు నొకనూతిలోని యడుగుభాగమున నేను సహాయములేక నేకాకినై యున్నట్లును, ఆ నూతియొడ్డున నాల్గుసింహములు నిలువఁబడి యున్నట్లును—అవి తమ లోఁదాము కడుభయంకరముగఁ గలహించుచున్నట్లును తుదకా నూయియంతయు నీటిచే నిండిపోవుచున్నట్లును—ఆజలమధ్యమున నేను ప్రాణనష్టుండనై— తన్నుకొనుచున్నట్లును—నూతిలోని జలమునఁ బ్రతిఫలించు తమ ప్రతిబింబముల జూచుకొని పైనున్న సింహములలో మూఁడు భీకరముగ నార్చుచు జలములఁబడి మరణించి నట్లును నాల్గవసింహము గర్వముతో నూతియొడ్డున నిలువఁబడియున్నట్లును దానిసమీపమున మరియొక యాఁడు సింగము నిలువబడియున్నట్లును కలఁగంటిని దీనిభావము నెఱుంగఁ గోరెద,

ముంతా—(స్వగ) అమ్మయ్యో! ఎంత భయంకరముగ నున్న
దీ? ఇదేమి స్వప్నమో కదా!

రోష—(స్వ) ఇదేమో భావగర్భితముగ నున్నది; దీనియర్థము
ను వినవలెను.

ఖాజీ—(కన్నులుమూసి యాలోచించి) అనతికాలములోన
తమరు విశేష వ్యాధిపీడితు లగుదురని తోచుచున్నది.

ముంతా—అబ్బ! ఈయప్రియమును విసిన నామనస్సు కలత
నొందుచున్నది.

ఖాజీ—అమ్మా! భయములేదు. వేయినుంది ఫకీర్లకన్నదా
నము చేసి-ప్రార్థనములు చేయించినచో నీదోషమునివా
రణమగును.

షాజ—అటులనే చేయింపుడు. నే నీదినమున యెండలకడ
విశ్రమింపవలయు. శరీరమున తిన్నగలేదు—నాకు సెల
విప్పింపుడు.........రోషన్—వచ్చెదవా?

రోష—ఇంకను వెలుతురున్నది. నేను క్రొంచెము, విహరిం
చివచ్చెదను.

(షాజహాన్—ముంతాజ్, పరివారముతో ప్రస్థానము)

రోష—(స్వగ) తండ్రిగారి స్వప్నము గూఢార్థపూరితముగ
నున్నది. ఖాజీసాహెబువలన సర్వముం దెలిసికొనవల
యును. (ప్రకా) ఖాజీమహారాజ్!

ఖాజీ—అమ్మా! ఏమి సెలవు?

రోష—తమతో నొకమాట యున్నది.

ఖాజీ—ఆనతీయవలయును.

రోష—చక్రవర్తిగారి స్వప్నమునకు మీరు కడు స్వల్పముగ నర్థముం జెప్పితిరి—

ఖాజీ—ఔను. అం దేయర్థము గలదో దానింజెప్పితిని.

రోష—కాదు. మీరు నాదగ్గఱ దాచుచున్నారు. సింహచతుష్టయమునకును, అడుసింగమునకును—పరిపూర్ణమైన యర్థమును సెలవీయవలయును—

ఖాజీ—అమ్మా! స్వప్నముల కంతటి గూఢార్థములుతీయుట సాధ్యముకాదు.'

రోష—మీరు మతగురువులు. మీ రెఱుఁగని దేదియును లేదు. మీరు నాకీ రహస్యము నెఱింగింతురేని మీకు విశేషలాభము గలదు.

ఖాజీ—(స్వగ) ఈ శుభావము చాలదూరము పోయినది. సరే! అందులకుఁ దగినవిధముగనే చెప్పెదను. (ప్రకాశించినవ్యనవ్వి) అమ్మా! చిన్నతనముగదా! మీ కాసంగతులేల?

రోష—చిన్నతనమైన?—వినుటకూడ పాపమగునా?

ఖాజీ—ఈరహస్యమును నేను చక్రవర్తికే తెలుపలేదు.

రోష—అందులకే మరల ప్రశ్నింపవలసి వచ్చినది.

ఖాజీ—సరే! నాకులాభించునపు డేలవిడువవలయును—చెప్పెదను. కాని యీమాట మీ రెక్కడా ననఁగూడదు.

రోష—మీకా భయమక్కఱలేదు.

ఖాజీ—నాలుగుసింహములు నలువురు రాజకుమారులు. నాయి కారాగృహము. చక్రవర్తిని కారాగృహము

సంధించి స్వల్పకాలముననే—నలువురు రాజకుమారులును రాజ్యమునకై పోరాడుదురు. ఆపోరాటమున నొక్క కుమారుఁడు మాత్రము నిలిచి జయమందును.

రోష—ఎవరా! జయశాలి?

ఖాజీ—అది చెప్పుటకు నాకు శక్తిలేదు.

రోష—సరే—పోనిండు—ఆదుసింహా మెవ్వరు?

ఖాజీ—ఇంతకన్న నేనధికముగ వచింపలేను—అమ్మా! నాకు నమాజువేళ యైనది.

రోష—ఖాజీసాహెబ్—మీకు కృతజ్ఞనై యుందును. నే పుదయమున నామందిరమునకు వచ్చెదరేని మీబహుమాన మందఁగలదు. నాకు సెలవిండు.

(ఖాజీ ప్రస్థానము)

రోష—(స్వగ) స్వప్నములు నిజములుకాకపోవు నను నాకీ స్వప్నమునందు నమ్మకము గలదు. కాదేని యీస్వప్నార్థమునే నిజమగునట్లు చేసెదను. దారాకు రాజనీతి యేమి తెలియును? ముఖప్రీతుల కలవాఁడు—సుజా తాగుబోతు; వేశ్యాలంపటుఁడు, మురాదు మూర్ఖుఁడు—ఇంక నాలుగవసింగము నాప్రియసోదరుఁ డౌరంగజేబు కావలెను—కాని ఖురాన్ వినువకున్నాఁడు!—ఊఁ!—ఈపూట కబ్రహ్మచర్యమున కేమి? వదలించెద నొకక్షణమున—... ఇక నాదుసింగము?—జహానారా యగునా? ఛీ! ఛీ!—జహానారాను పైకి రానిత్తునా! పాతాళమున కణచివేసెద—ఆయూడుసింగ మీరోషనారా కాకతప్పదు—ఔరంగజేబు

నకు శాసటమై రోషనారా—మొగల్ సామ్రాజ్యమును నిష్కంటకముగ నేలనున్నది. చిత్తమా! స్థిరముగనుండుము. భావి మొగల్ సామ్రాజ్య దివ్యపతాక సంచలనము రోషనారా హస్తగతమైయున్నది. రాజ్యారోహణమునకు, ఔరంగజేబు నామమాత్రుడు—రోషనారయే ఈవిజయ మహారథమునకు సారథి.

(ప్రస్థానము)

# దృశ్యము—3.

ప్రదేశము—దారామందిరము.

ప్రవేశము—దారా, ఫ్రెంచిఫాద్రీ న్యూటన్, గోవిందదాసు.

సమయము—ఉదయము.

దారా—మిస్టర్ న్యూటన్! మీరీవిషయమున కోపము లేకుండ తర్కించి, అసలుసంగతి తేల్చవలెను.

న్యూట—మేము బైబలు పవిత్రగ్రంథమును—తలక్రిందులు చేసి చదివినాము—ఆపరిశుద్ధాత్మ మహాశయుండు తెలియుచున్నది. ఆకాశరాజ్యమునందు యహోవా యొక్కండే పరిపాలించుచున్నాడు.

గోవిం—మీ యాకాశరాజ్యము—మీ యాకాశపంచాంగము దూరముగఁ బెట్టుఁడు; నేను చెప్పునది యేమనగా—యహోవాశబ్దమున కర్థము చెప్పజాలనుగాని, క్రీస్తుశబ్దము మాత్రము కల్పితము—

న్యూట—కల్పితమని మీరు ఋజువు చేయవలెను.

దారా—ఔను. గోవిందదాసుగారూ! మీరు దీనిని ఋజువు చేయవలెను.

గోవిం—నేను ప్రమాణములులేని మాటల నాడువాఁడను గాను. ఈనడుమ మాలో నొకగొప్పకవీశ్వరుఁడు వ్రాసిన గ్రంథభాగములను మీకు చదివివినిపించెదను. మాకృష్ణునే మీమతస్థులు క్రీస్తు అని పలికిరి. చూచితిరా—కృష్ణ—క్రీస్తు శబ్దములకెట్టి సామ్యముగలదో!—

నవ్యాట — దానికేమి? ఏమి? మీ ప్రమాణగ్రంథభాగములు

గోవిం — చదువుచున్నాను; వినుఁడు.

సీ॥ చెరఁబుట్టిన విష్ణుచరిత్రంబునే మార్చి
జననంబు పశుశాల జరిగెననుచు,
గోపాలకునిలీల లేసారఁగా మార్చి—
కడిది గొఱ్ఱెలమందఁ గాచెననుచు,
పాండుపుత్రుల కథావళి నంతయును మార్చి,
వారు బోధకులౌ ప్రవక్తలంచు,
పదవిలోఁ బంచత్వమొందు విధము మార్చి,
శిలువనైవిడనాడె జీవమంచు,
కృష్ణనామ మరసి క్రీస్తుగా మార్చి, యొ
కింత భేదముగను హిందూమతమె
ఘాతము జేసి క్రైస్తవమతము జేసిరె కాని
లేఁడు క్రీస్తనెడు వాఁడొకండు—

నవ్యాట — (క్రోధముతో) యువరాజా! చూచితిరా! క్రీస్తనెడువాఁ డొకఁడు లేనేలేఁడఁట! దొంగకృష్ణుని — రంకుకృష్ణుని బూతుకథలను మార్చుకొని మేము క్రీస్తుమతమును చేసికొంటిమఁట! ఈ దురాగ్రహపు వ్రాఁతలు నెవ్వఁడో యోగ్యతలేని పరమతద్వేషి వ్రాసెనఁట' అది వీరి కాధారమఁట! ఛీ! ఛీ! కృష్ణుఁడు హిందూశాస్త్రములందు చిన్నప్పటినుండియు నబద్ధములు నిశ్శంకముగ నాడినట్లును, దొంగతనములను నిరాటంకముగఁ జేసినట్లును—రంకుతనములను, నిరాక్షేపణముగ గావించి పదునారువేల గోపికల సంసారముల

నొక్క పెట్టిన గోతిలోఁ దోసినట్లును వ్రాయఁబడియు న్నది. అనఁగాక—రాజ్యాంగమునఁ బ్రవేశించి కురుపాం డవయుద్ధమునుఁ గల్పించి యన్యాయముగ కౌరవుల నంద అను చంపించినట్లున్నది. వీఁడు భగవంతుఁ డెట్లగును? ఈకథ నాదర్శముగఁ దీసికొని క్రైస్తవమతమును నిర్మిం చుకొనునంతటి దురదృష్టము మాకెందులకుఁ గలుగును?

గోపి—కృష్ణావతార రహస్యము నెఱుఁగుటకు నీవెంతవాఁ డవు? మిడిమిడి జ్ఞానముచే దూషించితివిగాని—.....అం దఱికి మహాశాస్త్రముల యంతరార్థము తెలియుట కవి యంత పైపైచుండలేదు.

న్యాట—నీవు చెప్పుచున్న యాయంతరార్థ మేదియో వినఁ గోరెదను.

గోపి—సూక్ష్మముగఁ జెప్పెదను. వినుము—

నారా—ఇది నాకు సుదినము.

గోపి—

—* గీతము. *—

అసమ నవనీత మృదుల భక్తాళిహృదయ
చోరుఁడని తెల్ప నవనీతచోరుఁడయ్యె
లింగభేదంబు భక్తికి లేదటంచుఁ
దెలియఁజేయ గోపికలలోఁ గలసిపోయె
చర్మపాంచాలికా దేహ మర్త్యదురభి
మానమును, పృథగాత్మాభిమానములును
కలుష కార్య సంశయ సూచకంబు లౌట
గోపికల చేలములఁ గొనిపోవ రాత్రిని
మనుల బోఁద్రోలి, చిత్తైక్యత్రయ మొసఁగె.

సామ్రాట్ — చాలు ! చాలు ! ఇంకనీపురాణము గట్టిపెట్టుము. ఇట్లు నీవేదియో కల్పించి బూతులన్నిటిని నీతులనుగా సాధించుచున్నట్లు కనంబడు చున్నావు.

గోవిం — బూతులే కావు; మీవంటి యవివేకులు నీతులనే బూతులనుకొనిరి — హ్యాటన్ దొరగారూ! మీరు మా కృష్ణుని పశులకాపరితనము నర్థము లేకుండ దొంగిలించి సాభావమును నిరర్థకము చేసితిరి — కాని యందు కొంత యర్థమున్నది.

— * గీతము. * —

ప్రకృతి కాధారములు పాడి పంటలగుట,
పాడికొరకె కృష్ణుండు పసుపాలుఁ దెచ్చె
పంటకొరకన్నయగు బలభద్రనాము
చేతికి హాలంబునిచ్చె సుశ్రీజెంగ
వ్యక్తిగొల్లతనం బవివేకుల కగు
రామకృష్ణుల యవతార రహస్యములు

సామ్రాట్ — మీ శాస్త్రములయందు గల యసందర్భములను అనన్వయములను నీవెట్లు సమర్థింపఁగలవు?

గోవిం — ఏవా యసందర్భములు?

సామ్రాట్ — వసుదేవునకు యమున దారియిచ్చెనా? — చెరసాల తలుపులు వగిలెనా? — ద్రౌపదికి చీరలు కొల్లకొల్లలుగ వచ్చెనా? — కృష్ణుడు విశ్వరూపము చూపెనా? అతనినోట బ్రహ్మాండములు కనంబడెనా? ఎవరు నమ్మగలమాటలివి? — పిట్టకథలు —

గోవిం — ఇట్టి పిట్టకథలు, మీ క్రీస్తు చరిత్రమున వెదకినచో వానకాలమునందలి యీసిళ్ళపుట్టలవలె బయలుదేరగలవు

న్యాయ — ఆఁ! అవి మహిమలు.

గోవిం — ఆఁ — అవి మహిమలా? — ఇవి పిట్టకథలా? — యువరాజా వినుచుంటిరా? ...... క్రీస్తు సమాధిలో పెట్టిన, మూఁడవనాఁడు బయలుదేరి మరలవచ్చినాఁడు — అంత మహిమ గలవానికి చచ్చుదుర్గతియేల? శత్రువులకుఁ జిక్కి సిలువపైఁ గొట్టఁబడి ఘోరదుర్మరణముఁ గాంచిన నాతఁడు భగవంతుఁ డెట్లగును? క్రీస్తు ముట్టుకొన్నంతనే గ్రుడ్డివానికి కన్నులువచ్చినట్లును — కుష్ఠరోగులు నిరామయులైనట్లును చెప్పఁబడియున్నది. ఇవి మహిమలే యైనచో మాపురాణములందింతకన్న నుత్తమోత్తమ చర్యలు గలవు ఇవి యసంభవములు నవిశ్వసనీయములు నైనచో మాపురాణములందలి విషయములకన్న మీమతగ్రంథములందే విశేషములు గలవు.

దారా — నే నాలోచించిచూడ, నీవిషయము చర్చించుటయే యవివేకమని తోఁచుచున్నది. హిందూ క్రైస్తవ మతములతోఁ బోల్చినచో మహమ్మదీయ మతము మరియు నసంభవ విషయపూర్ణముగ నున్నది — అందుచేత — ఈ ద్వేష చర్చలఁ బూనుకొనక — జగదాధార భూతుఁడగు నీశ్వరుని — క్రైస్తవులు “యహోవా” యనియు, హిందువులు “రామకృష్ణ” లనియు — మహమ్మదీయులు “అల్లా” యనియు దలంచి తరించుటయే వివాదములేని మార్గము! —

[అన్యసి ప్రిసి'',

మనసు స్వాధీనమునగ నీక— మనుజుం డెప్పుడు—
సత్య జీవనమును నహింసయును సర్వ
సమతయును భూతదయయు నష్టాంగశీల
సంగతాసూన పద్ధతుల్ సంతరించి
జీవ యాత్రను గడుప— నా దేవుఁడొకండు
కలిగినా తత్కృపాలబ్ధిఁ గాంచఁగలఁడు
దేవుఁడే లేక యుండెనా— దివ్యశీల
మార్గగామి యగుటచేత— మహిత దివ్య
పర మహానంద విభామున నరయఁగలఁడు॥,,

( దారా ప్ర॥ )

దారా— పండితులారా! మా తండ్రిగారు, నెలదినములలోపల సుజాను బంగాళమునకు నౌరంగజేబును దక్షిణదేశమునకు— మురాదును గుజరాతునకు సుబేదారులుగా నరుగవలసినదని శాసించినారు.

సర్కట— నేమరిని ?

దారా— నే నిండే యుందును.

గోపి— అటులైన మన శాస్త్రచర్చలు కట్టుపడ లేదన్నమాట

దారా— నాకీదినమున వేరుగా పనియున్నది. మనము మరల రేపు కలసికొందము—

గోపిం— చిత్తము—

( అందఱు ప్రస్థానము. )

దృశ్యము—౪.

ప్రదేశము—జోబనామహలు

ప్రవేశము—జోబనా—షుజా.

సమయము—రాత్రి.

జోబ—నిన్ను నమ్మఁగూడదు. నీవు క్రమముగ ఝూటాకోరువై పోవుచున్నావు! నిన్న వేయిరూపాయలు కావలయునని నే నడుగఁగా — ఇదిగో తెచ్చెదనని, చని, నీవు వట్టిచేతులతో వచ్చితివి! నీసేవ జేయుచు—నీయాజ్ఞలను చేతులు జోడించుటకు నేను నీవు సిఖా చేసికొన్న దాసిని కాను. కంచన్ అనగా నర్థమేమో తెలియునా? 'కాంచన్' అనగా ధనము. కాంచనమువలన లభించునది కంచెన్. నేను ధనకాంతను. నీవు బాదుషా కుమారుఁడవైన నాకేమి? నీవు షుజావైన నాకేమి?—నాకు ధనమే ప్రాణము; ......నేను నీకు స్పష్టముగఁ జెప్పుచున్నాను. ధనమును చేతఁబట్టుకొనియే నీవు నాయింటికి రమ్ము—లేనిచో నీవు నీవే. నేను నేనే—

షుజా—అరే! చెప్పినమాట వినవేమి?—నిన్న—నీవు చూచుచుంటివి గదా—యిక్కడ త్రాగి నే నొడలు తెలియకుండ నున్నప్పుడు—తంత్రీగారింటికి పాలకిలో మోయించుకొని వచ్చిరి—తరువాత నేను, ఖజానాదగ్గఱకుఁ బోయి ధనము నడుగగా—మంత్రులు సెలవు లేదని చెప్పినారు. ఆముంక కొడుకుల నెంతపనియైన చేసియుందును. గాని, అప్పటికే నైపు దిగిపోయినది.

జోబ—సరే! సరే! ఈ ప్రయోజనశూన్యముల కేమిలే—ఖజానా
లో నుండి చూడ, దమ్మిడికాసు పుట్టని గతిబట్టినది గదా—
అదిగో తలుపు తెఱచియున్నది—ఇఁక దయచేయవచ్చును.

షుజా—అబ్బా!—చెప్పునది శాంతముగ విని చెప్పవలెఁ గొప్ప
వచ్చును—నడుమ నడుమ నన్నల్లరిపెట్టకు. అవల కునికి
పాట్లు పడుచున్న మసానదుగాఁడు లేచి, మన సంభాష
ణము వినెనేని—నను వీపై కెక్కించును.

జోబ—అబ్బా! అంత యభిమానముగలవాఁడవు విల్లు చేసితివా?

షుజా—అభిమానముల కెక్కడిదిలే?—మీకు మానము,
మాకభిమానము నున్నచో—మీరీపని చేయలేరు—మేము
మీకున్నము లెక్కలేము.

జోబ—మా కొంపలు లేనిది గతిలేదు—నమ్ములను దట్టిన
నా టకారము—ఈ సిటులు ముంచకొనుదురు కిఁరయొక స్వ
రోగము—నీ విమర్శనల కేమిలే —అసలుకథ చెప్పు—

షుజా—పెరల నొకసారి—రెండుసారులు మంత్రులను బెదిరిం
చి చూచెదను. ఇచ్చిరా, సరే—లేకున్న దాని కింకొక
చక్కని మార్గ ముండనే యున్నది.

జోబ—ఇంకేమి మార్గమున్నది?—వల్లకాటి మార్గము—

షుజా—చక్రవర్తి—నన్ను బంగాళమునకుఁ బొమ్మన్నాఁడు
అప్పుడు ఖర్చుల కొఱకై నాలుగులక్ష లిచ్చెదరు—నీవు
నా వెంటనే వచ్చెదవుగాదా? ఆనాలుగులక్షలు నీవే!

జోబ—(స్వగ) ఈత్రాగుబోతు మాటలు నమ్మినవాఁడెవరు?
ఈమాటలు నిజమైనమాత్ర మా నాలుగులక్ష లెక్కడికి

జోబ—నాకు బుజువులు సాక్ష్యములెందుకు? అదుముండకు-
చక్రవర్తి కొడుకు కుమారుడవు. దైవానుగ్రహమున నన్ను
చచ్చినచో చక్రవర్తివి కాదగినవాడవు. భోగముదాని
కిచ్చుటకు వేయిరూపాయలు సంపాదింప లేకున్నావనిన
నమ్ము బుద్ధిహీనులెవ్వరు? ఇచ్చుటకిష్టములేదని యొక్క
మాట చెప్పరాదా? ఎందుకీమోసము! ఎందులకు నన్నార
డిపెట్టి నడివీధి కెక్కించెదవు!

షుజా—ప్యారీ జోబనా! నిన్నెన్నడైన నేను మోసగించి
తినా ఎన్నడైన నీకాశజూపి లేదంటినా? నీపై భ్రాంతిచే
నేనింతవఱకు పెండ్లి సయితము మానితినే.

జోబ—నిన్ను పెండ్లిమానుమన్న వారెవ్వరు!—పెండ్లిమాని
నది నన్నుద్ధరించుటకా యేమి! కాకనన్నిట్లు చెప్పుటకా?
నీవు సుఖముగ పెండ్లియాడవచ్చును. నాకు విటులుదొర
కకపోదురా; నీవు చక్రవర్తికొడుకునని పెద్దపేరు పెట్టు
కొని ముష్టివేయిరూపాయలకయి నన్నిట్లు యేడిపించు
చున్నావుగాని చక్రవర్తులు కాకపోయినను చక్రవర్తికు
మారులు కాకపోయినను నీకన్నదాతలు తమధనమాన
ప్రాణములు నాకుధారపోయుదుమని యనేకమంది జమీం
దారులు తిరుగుచున్నారు. ఎందుల కెందులకని నీత్రికి
కట్టుబడి—ఛీ! దిగినది పాడువృత్తి—చచ్చుదాక నొక
నితోనే యుండవలెనని యేడ్చుచున్నాను. నీవిప్పుడీడబ్బు
నీయలేక—నాయింటికి రానర్హతలేకపోయినను. నేనిటు
లేయుండుదాననేకాని మరొకని నాశించుదానను కాను

నీవే నమ్మలేక—నాపైవిశ్వాసములేక—వేయిరూపాయల కొరకు ?.

షుజా—అబ్బబ్బబ్బబ్బ!—ఎందుకింత కోప?—నీవు విశ్వాసము లేనిదానవన్న వారెవ్వరు? నిన్ను నమ్మని చండాలుఁ డెవ్వఁడు—నాకే కొంచెము చేతిలో సర్దుబాటులేక—... ......నీవుగట్టిగ పట్టుబట్టితివా! చక్రవర్తి లెక్కయేమి?—నాయన్న దారా లెక్కయేమి?—దొంగవలె—మాతమ్ముఁ డౌరంగజేబు ఖురాను చేతఁబట్టుకొని ఒక ధ్యానము చేయుచున్నాఁడు—తనవర్తన మెవ్వరికిఁ దెలియలేదనుకొనుచున్నాఁడు—ఇట్టి దొంగలగుణములఁ బసికట్టుటలో—నీషుజాకున్న చాకచక్య మింకొకరికి లేదు—ఇఁక మురాదు కొక్క చెంపపెట్టుచాలు—ముసలి రాజును చెఱసాలలోఁ బారవేసి, యొక్కొక్కనినే సఫాచేసి—చెఱుకు ముక్కలు నఱికినట్లు నఱికివేసి—మా జోబనాను ఢిల్లీ సామ్రాజ్యమునకు రాణింజేసి—సారా ప్రవాహములు విదేశీయపు బ్రాందీ, విస్కీ—సముద్రములు నిర్మింపనా!—ఏమనెదవు జోబనా!

జోబ—ఆఁ! తాగినప్పుడంత పనిచేయలేనున్నట్టి మాటలైన నాడుచుందువుగాని—కొంచెము కంఠము జారెనా ఈ లోకమున నుండవు—చక్రవర్తి ఎవ్వరో—దారా ఎవ్వరో!

షుజా—(స్వగ) కొంచెము మొత్తఁబడుచున్నది. దీని నిష్టజే యూదరగొట్టవలయును (ప్ర) జోబనా! కొద్ది రోజులలో ఏదో యొకటి తెగిపోవును. కనుక—

జోబ—ఏమి తెగిపోవును? నీ కంఠమో నా కంఠమో తెగ వలెను—

షుజా—అట్లు కాదు—వ్యవహార మేదో యొకటి తెగును—కనుక నీవు రాణివి—నేను చక్రవర్తిని—......చూడు అబ్బా;-చాలా ప్రొద్దు. బోయినట్లున్నది. ఇక్కడ చలిగాలి కూడ వీచుచున్నది—లోపలకుం బోవుదము రా—

జోబ—లోపలి కెందుకు?—

షుజా—ఎందుల కేమిటి?—

జోబ—గదిలోనికిం బోవుట కంత తొందర పడు వాండవు రూపాయలేల తేక—చేతులూపుకొనుచు వచ్చితివి!--హో హో-. ఈమాటలు—ఈమాయలు--జోబనాదగ్గర సాగరావు-- ఈరాత్రి యేతంటాలు పడినను సరే--వేయిరూపాయలు తేవలెను--నేనుదానికి రావలెను.

షుజా—(స్వగ) ఛీ! దురాశాపాతకి మంచిచెష్టలు లేని మాయ ముండ!--ఈకత్తితో నఱికి వేతునా!......................... అందువలన ననేకకష్టములున్నవి. తొందరపడగూడదు. (ప్రకా) ప్యారీ!-స రే నీ వింత పట్టుబట్టినపు డేమిచేయుదును. ఖజానా మర్మబుచేయకముందే పోయి మంత్రులను బెదరించి సొమ్ము తెచ్చెదను.

జోబ—సరే తెమ్ము సంతోషమే--

షుజా—జోబనా!

జోబ—ఏమి!

షుజా—నరములలో పట్టేమియుఁ గనఁబడదు. ఒకబుద్ధిచెప్పి నాగొంతులోఁ బోసితివా! పెద్దపులివలె ఖజానాపైఁబడెదను.

జోబ—బుద్ధి?—నాదగ్గఱ నెక్కడిది?

షుజా—లేకున్న తెప్పింపుము మసావదును లేపుమనా?

జోబ—నాదగ్గఱ నీవు తెచ్చియిచ్చిన ధనము మూలుగుచున్నదని తెప్పింతునా? ఏమియూయువివేకము యీగోల్మాలునాకు తెలియదు. సొమ్ము తెచ్చితివా లోపలకు రమ్ము—లేదా నడు.

( నిష్క్ర )

షుజా—(తన) ఆ! ఆ! ఎంతతీవ్రము! తలుపుకూడ వేసికొనినది! కంచెక తొత్తుకింత గావరమా! రాజకుమారుఁడనని స్పృహలేదుగా! ఛీ! ఛీ! నేను దీనికిచ్చిన చనువేయింతకు గారణము! ఇప్పుడేమనుకొన్న నేమిలాభమున్నది? ఏది యెటులున్నను—వేళదాటిపోయినది. నాకుశరీరమున బలము తగ్గుచున్నది. ఏదిరాసువర్ణాభరణము తాకట్టుపెట్టి సురారసము దెప్పింపక తప్పదు- నాకు నెలనెలకు రావలసినధనముకూడ నేను నెలలనియుండేవాడితిని ఏదోమార్గమాలోచింపకున్న కాలము నడుచునట్లులేదు దీని మొగమున వేయిరూపాయలు తెచ్చి పడవేయకున్న కార్యములేదు...................ఈముండకొడుకు భంగు [తాగి పడిపోయినాఁడు మసావద్—మసావద్—

మసా—(కన్నులు నలిమికొనుచు లేచి) జీ—జీ—సర్కార్—

షుజా—నా మందిరమునకు దారి చూపుము—

మసా—సర్కార్—ఇంకను తెల్లవారలేదు.

షుజా—లుచ్ఛా! భంగు ద్రాగితివా!—తెల్లవారుటేమి?

మసా—జీ! జీ! ప్రొద్దు గ్రుంకలేదు.

షుజా—ప్రొద్దు గ్రుంకలేదా!

మసా—జీ! జీ!— తెల్లవారినది—ప్రొద్దు గ్రుంకినది—

షుజా—లేచెదవా! చంపవలయునా?

మసా—(భయముతో నడుచుచున్నాడు.)

(ఇద్దఱు ప్రస్థానము)

ప్రథమాఙ్కమ్.

# తాజ్ మహల్.

## ద్వితీయాఙ్కమ్.

### దృశ్యము—౧.

ప్రదేశము—ముంతాజ్ మహల్ మందిరము.

ప్రవేశము—ముంతాజ్—ఆస్మాన్.

సమయము—ఉదయము.

ముంతా—బేటీ! ఆస్మాన్—

ఆస్మా—అమ్మా!

ముంతా—నీవు నన్నమ్మాయని పిలుచుట నాకిష్టములేదు. మా పెద్దకుమారుఁడగు దారాకు నిన్నిచ్చి వివాహము చేసి, నాయనంతర మీ విశాల రాజ్యమునకు నిన్ను చక్రవర్తినిఁ జేయఁ దలఁచితిని.

ఆస్మా—(సిగ్గునఁ దల వంచుకొనుచున్నది.)

ముంతా—(గడ్డముఁబట్టి పైకెత్తి) బేటీ! దారాపై నీ కిష్టము లేదా!—

ఆస్మా—అనాథనగు నన్ను పెంచి పెద్దదానిఁజేసిన మీరు నాకమ్మగాక మరేమగుదురు?

ముంతా—అత్త నగుదును.

ఆస్మా—చాలులెండి—(సిగ్గుపడి పోఁబోవుచున్నది.)

ముంతా—(పట్టుకొని, ఆష్మా! నాదగ్గఱ నీకు సిగ్గెందులకే!- మొన్న నీగదిలో దారా పటమును నేను చూడలేదను కొంటివా?

ఆష్మా—అదే యన్నమాట యేమి? నాగదిలో ననేక పట ములున్నవి

ముంతా—అనగా నీ కనేకులపై-

ఆష్మా—బాగున్నదిలెండి—నాకు పనియున్నది పోవలయును—

ముంతా—అబ్బ! నాకు తెలియని పనులు నీకేమున్నవో! మగని కన్నము వండిపెట్టవలయునా? పిల్లలకు పాలీయ వలెనా?

ఆష్మా—(కూరుచుండి) వర్షకాలము ప్రవేశించినది!—రెండు దినముల నుండియు నొకటే వర్షము—ప్రకృతియంతయు జలమయమైనది. బయట కాకులు సయితము మెల్లాడుట లేదు—ఉదయముననే, చీకటి వ్యాపించుచున్నది.

ముంతా—ఓ గడసరి! మాట మార్చుటలో నీయంతటిది లేదు—పెంచి పెద్దదానింజేసిన నన్నే మాయచేయుచుం టివి!........చూడు మా దారాను చేసికొందువా?

ఆష్మా—(తలవంచుకొని) నాకేమి తెలియును! అన్నిటికిని పెద్దలు మీరు—

ముంతా—చక్రవర్తిగారితోఁగూడ మీ వివాహము మాట చెప్పితిని......ఉండు నీ భావిఫలముఁ దెలిసికొనవలయు నని నా కెన్నాళ్ళనుండియో యున్నది. లైలా!—

లైలా—(ప్ర॥) మహారాజ్ఞీ!

ముంతా—ఖాజీ మహారాజును పిలువుము.

లైలా—(ప్రస్థానము.)

ముంతా—చక్రవర్తి నీ కల్యాణకాలమున నశేషధనము నిచ్చెదనని వాగ్దానము చేసినారు — అదిగాక — ఇదిగో చూడుము...(పెట్టెలోనుండి యొక రత్నహారముం దీసి) ఈ రత్నహారమును గోవా వర్తకులవద్ద చక్రవర్తిగారు లక్ష రూపాయలకుం గొనిరి. అవి నాకు వారిచ్చునప్పుడు "నా యిష్టమువచ్చిన వారికి దీనిని బహుమానముగ నిచ్చుకొందు" నని నేనడిగితిని. వారు నవ్వుచు—"ఎవరి కిచ్చెదవు? అర్జ్మాను బీబీ కిచ్చెదవని తోచుచున్న" దని పలికిరి. "ఔ" నని నేనంటిని. కనుక—అర్జ్మాన్! కల్యాణకాలము నా డీ యమూల్య మణిమాలను నీ కంఠప్రదేశమున నలంకరించెదను.

అర్జ్మా—మీ దయకు పాత్రురాలను.

ఖాజీ—మహారాజ్ఞీ!—

ముంతా—ఖాజీమహారాజ్! నమస్కారము ఇదిగో పీఠము.

ఖాజీ—(కూర్చుండి) ఏమి సెలవు?

ముంతా—ఈ బాలిక నెఱుగుదురా?

ఖాజీ—ఆహా! అర్జ్మాన్ బీబీ నెఱుగక పోవలయునా? తల్లిదండ్రులు చనిపోవగా మీరు ప్రేమతోఁ బెంచుకొనుచున్న సౌందర్యవతికాదా?

ముంతా—ఔను. నాకొక సంకల్పము కలిగినది! దాని ఫలాఫలములను విమర్శించి మీరు చెప్పవలయును.

ఖాజీ—సెలవీయవలయును.

ముంతా—మా పెద్దకుమారుడగు దారాకీ బాలికనిచ్చి వివాహము చేయవలయునని నాయుద్దేశ్యము—నాయుద్దేశ్యమే కాదు. చక్రవర్తిగారియుద్దేశము నంతే—ఈబాలికకు భావిభారత సామ్రాజ్యమునకు చక్రవర్తినియగు రేఖయున్నదో లేదో చూడవలయును.

ఖాజీ—( షమ్మాన్ చేయి చూచి కనులు చిట్లించుచున్నాడు)

ముంతా—మహాత్మా! ఏదైన దుష్టరేఖ కలదా?

ఖాజీ—(స్వగ) ఇట్టివిషయములందు సత్యము వచింపగూడదు. (ప్రకా) ఏమియును లేదు. అష్మాన్‌బీబీ జాతకము దివ్యమైనది. తమ సంకల్పమునకుఁ దగినట్లే రేఖలన్నియు శుభమును సూచించుచున్నవి. సాముద్రికప్రకారము చెడుగేమియును లేదు. ముంతాజ్ మహల్‌బీగము తరువాత—ఆర్యావర్తమునకు అష్మాన్‌బీగమే చక్రవర్తిని;

ముంతా—ఇంకేమైనా దుష్టవిషయము గలదా?

ఖాజీ—మహారాణీ! క్షమింపవలయు—

ముంతా—సంశయమెందుకు? చెప్పుటకేకదా మిమ్ముఁబిలువనంపినది మంచిచెడ్డలన్నియు దెలుపుఁడు

ఖాజీ—జ్యోతిషగణన ప్రకార మొక దుష్టగ్రహ మాటంకముగనున్నది. అదిలేనిచో నీమెయదృష్ట మనన్యసాధ్యము.

ముంతా—అందులకయి గ్రహశాంతులు నమాజులు చేయించెదరా!

శాంతిమహల్]

ఖాజీ—భాగ్యము—

ముంతా—దుష్టగ్రహము తొలగునట్లు చేయుటకు వలయు ధనము పంపెదను.

ఖాజీ—చిత్తము (స్వగ) ఇది సంకల్పించకయే లభించిన లాభము! (ప్రస్థానము)

ముంతా—బిడ్డా! రమ్ము—

—(ఇరువురు ప్రస్థానము)—

## దృశ్యము—౨.

ప్రదేశము—ఔరంగజేబు మందిరము.

ప్రవేశము—ఔరంగజేబు, రోషనారా

సమయము—సాయంకాలము.

ఔరం—రోషన్! నీవు సంగీతము నేర్చుకొనుచుంటివంట గాదా?

రోష—ఏదో—ప్రొద్దుపోనిపని.

ఔరం—పాడుసంగీతము సంగీతమందేమి రుచియున్నది? నాకే యధికారము వచ్చెనా—సంగీతపాఠకుల నందఱను వరుసగ నిలువఁబెట్టి నఱికించి యుందును.

రోష—దానిని పోనిమ్ము—సోదరా! నీతో నొకవిశేషాంశమును చెప్పవచ్చితిని.

ఔరం—ఏమది? మరల జహానారా........సాదతుఖానుతోనేమైన—

రోష—అదికాదు, ఈవిషయము వేరు—నీవు సావకాశముగ వినవలయును...............అన్నట్లుమఱచితిని. చక్రవర్తి నిన్న దక్షిణమునకుఁ బొమ్మనెనా?

ఔరం—ఔను—నీవు చెప్పవచ్చినమాట..............

రోష—నీవు పోఁదలంచితివా?

ఔరం—చక్రవర్తియాజ్ఞను మీఱుటెట్లు?

రోష—నీవు ఘోరాముసు మూపివేయు[illegible]న్నమాట—

[“స్వప్నములను నమ్మవచ్చునా?„

ఔరం—ఏలమూయవలయును?

రోష—సరే—(స్వగ) ద్వంద్వహృదయము—

ఔరం—నీవు చెప్పవచ్చినమాట చెప్పనేలేదు.

రోష—ఔను.........ఒకచిత్రమగు జ్యోతిషగణనమును వింటిని—

ఔరం—అదియెట్టిది?

రోష—చక్రవర్తి కొలదిదినములలో వ్యాధిగ్రస్తుఁడగును. అప్పుడు రాజపుత్రులు నలువురు తగవులాడుదురు. చక్రవర్తి కారాగృహగతుఁడగును. నలువురుకుమారులలో నొకఁడే జయమందును. కడమ ముగ్గురు హతమగుదురు ఒకయంగన జయమందువాని పక్షమున నుండును—దీనియర్థము గ్రహించితివా?

ఔరం—ఇది చాలవిచిత్రముగనున్నది. చతురంగపు టెత్తువలె నున్నది.........దీని నెవ్వరు చెప్పిరి?

రోష—ఈశ్వరుఁడు,

ఔరం—అనగా—

రోష—చక్రవర్తి కట్లు స్వప్నము వచ్చినది.

ఔరం—స్వప్నములను నమ్మవచ్చునా?

రోష—ఇంతేకాదు. స్వప్నమునందలి యర్థమిదియని ఖాజీ సాహెబు చెప్పినాఁడు.

ఔరం—అటులనా?

రోష—నీకు స్వము తెలిసినదా!

ఔరం—నీవే చెప్పుము.

రోష—జయశాలియగు రాజకుమారుఁడవు నీవు; నీకు బాసటయగుదానను నేను.

ఔరం—అట్లెవ్వరు చెప్పిరి?

రోష—రోషనారా చెప్పుచున్నది. తమ్ముఁడా! — ఈరోషనారా యట్లు చెప్పుచున్నది!

ఔరం—భావిసంకల్పము !

రోష—భావిసంకల్పమే కాని—కాని దాని ననుభూతము చేసెదను. ఈవిషయములు నీకొక చక్కనిమార్గము జూపుట లేదా! అదే జయమార్గము............రోషనారా యెంత పనినైనఁ జేయఁగలదు. కాని నీవు మర్మమువిడిచి నాతో మాటలాడుట లేదు. అనియే యవశిష్టము—మన మిప్పు డూరకుంటిమా రాజ్యము భిన్నభిన్నములైపోవును భావిస్థితిం బరికింపుము

ఔరం—(కన్నులుమూసి ఆలోచించుచున్నాడు)

రోష—ఆలోచనల కెడములేదు—నీవుదప్ప రాజ్యార్హుఁడెవ్వడును లేఁడు—మహమ్మదీయుఁడయ్యు—దారా మహమ్మదీయ మతద్వేషి అట్టితురాత్ముఁడు — స్వమతద్వేషి ఢిల్లీసింహాసనముపై నుండుటనుఁ జూచి నేనోర్వలేను. షుజాసంగతి చూచుచునే యుంటివి గదా! నాలుగు విస్కీబుడ్లను ముందువేసితిమా షుజా మనబానిస —

[“స్వప్నములకు నమ్మవచ్చునా,,)

మూర్ఖుఁడగు సుల్తానుకంటె నేను దుమ్ముకొట్టెదను. నీవు నా యాలోచన వినవలయును. నీకిప్పటికిని మూల సూత్ర మదియొక్కటియే'

ఔరం — ఉండు. ఎవరో వచ్చుచున్నారు.

(సేవకుఁడు ప్ర॥)

సేవ — సలాం మహరాజ్

ఔరం — ఎక్కడనుండి వచ్చితివి?

సేవ — మీర్ జుమ్లా వద్దనుండి ఉత్తరము తెచ్చితిని.

ఔరం — దాని నిచ్చి — ఆజ్ఞయగువరకు ద్వారమున నుండుము!

సేవ — చిత్తము (సలాముచేసి ప్రస్థానము)

ఔరం — (చదువుచున్నాఁడు)

గోప — మీర్ జుమ్లా ఎవఁడు?

ఔరం — మీర్ జుమ్లా ఇదివరకిక్కడ నుండువాఁడే! మంత్రి పదవినుండి చక్రవర్తి తొలగింపఁ దక్కనుకొని గోల కొండ నవాబువద్ద నున్నాఁడు. ఇప్పు డచ్చటఁ గూడ శత్రుత్వము సంపాదించుకొని యిప్పుడు గోలుకొండ పయి కెత్తి రావలసినదని నాకు వ్రాసినాఁడు.

గోప — సరే! ప్రమాణ మాడితికే కదా!

ఔరం — గోపన్నా! మనము కొన్ని విషయములను మాటలాడు కొనవలయును. ప్రత్యేక మందిరమునకు రమ్ము.

(ఇరువురు ప్రస్థానము.)

## దృశ్యము—3.

ప్రదేశము—చక్రవర్తి ఖజానా గది.

ప్రవేశము—మంత్రులు మొ॥ వారు తమ పనులందుందురు.

సమయము—సాయంత్రము.

(మధుపానమత్తుండగు షుజా వేగముగ ప్ర॥)

షుజా—ఖజానాలో నెవ్వండు?

మంత్రి—(తన) తూగి వచ్చినటులున్నాండు (ప్ర॥) చిత్తము—

షుజా—మేము సంతకము చేయుచున్నాము వేయి రూపాములు కావలెను.

మంత్రి—చిత్తము; ఖజానా కట్టివేసినాము. రేపు—

షుజా—ఆడి బద్మాష్ మాట—ఇంత ప్రొద్దుండగా ఖజానా కట్టివేయుమని ఏలుచాచ్ఛ చెప్పినాండు?

మంత్రి—తమరు సావకాశముగా వెళ్ళి యిప్పటికి పండుకొనండి.

షుజా—ఛీ! ఏమి? ఎందులకు మేమిప్పుడు వెళ్ళి పండుకోవలెను—మేము త్రాగినామనియా?—కానీ—త్రాగనీ-త్రాగితే నీకేమి?

మంత్రి—చిత్తము—

షుజా—చిత్తము సరే! రూపాయలేవి?

మంత్రి—తమకు రొఖమిచ్చుటకు సర్కారుహుకుము లేదు.

షుజా—రఖం—హుకుం—హేహేహేహే-ఎవండురా సర్కార్! ........ఈరాజ్యము నాది—తెలిసినదా? దారా చచ్చి

నాఁడనుకో! చక్రవర్తి అంతకుముందే............అనుకో తెలిసినదా—ఇఁకమీకు చక్రవర్తి షుజా! జాగ్రత్త—నా డబ్బు నాకుకావలెను. మాగాడుటకు నీవెవ్వఁడవు?

మంత్రి—(స్వగ) కార్యము మించివచ్చునటున్నది. చక్రవర్తియే రావలయును. (సేవకులకు సౌజ్ఞచేయుచున్నాఁడు)

సేవ—(వేగముగ ప్రస్థానము)

మంత్రి—చిత్తము. అటులే యిచ్చెదను, కొంచెము మీరు విశ్రమింపుడు—షరబతు తెప్పింతునా?

షుజా—హే హే హే — నీమాటలకు బ్బిపోవుటకు బాలను గాను-జాగ్రత—వీఁడు—వీఁడు—వీఁడు-షుజా—కైపుదిగిపోవలయునని షరబత్ తెప్పించెదనంటివి కొంచెము షరాబ్ ఉంటే తెప్పించు—త్రాగెదను—హే హే హే

మంత్రి—చిత్తము తమకు తెలియనిదేమున్నది?

షుజా—నాకు తెలియనిదేమియును లేదు, నాకండ్లకు గంతలు గట్టకు—మీవంటి దొంగలను షుజా ఎప్పుడును నమ్మఁడు—నాకుపరిపాలనాధికారము వచ్చినచో—మీవంటి యధమోద్యోగులను గానుగులకు గట్టి త్రోలెదను

మంత్రి—(స్వగ) అల్లా యనుగ్రహమున నీ కేపదవియు రాకుండుఁగాక.

షుజా—ఏమి యీయాలస్యము. మాకు వేళ దాటిపోవుచున్నది!—నీవిచ్చెదవా నేను తీసికొని పోనా! ఏదిధనము

మంత్రి—తమకు స్వతంత్రముగ—

షుజా—స్వతంత్రము?—ఎవండురా నన్నడ్డు నిర్భాగ్యుండు—రానీ వాని నీ కటారితోఁ బొడిచెదను. (కత్తిదీసి) ఏదీ ధనము?—(లోపలకుఁ బోయి సంచియెత్తును.)

(షాజహాను ప్రవేశము)

షాజ—షుజా!—

షుజా—(సంచి క్రిందఁబడవైచి భయముతో నిలువఁబడును).

షాజ—ఏమి యీ యత్యాచారము! మంత్రులపయిఁ దిరుగబడుచున్నావంటే!............ఏమి యీ వాసన...ఎప్పుడు త్రాగుడేనా? మఱియొక పనిలేదా? పద— నామందిరమునకు—సేవకా మార్గము ......... మంత్రీ నీపని చూచుకో.

షుజా—(తలవంచుకొని నడచును)

(అందఱు ప్రస్థానము.)

## దృశ్యము—౪.

(ప్రదేశము—రోషనారా మందిరమునందలి సంగీతశాల
ప్రవేశము—రోషనారా-సాదతుఖాను సంగీత పరికరములతో
సమయము—సాయంకాలము.

సాద—(వీణ నొకమూలఁ బెట్టి-) నేను మోహనరాగమును బోధించుచుండ మీరు కల్యాణిశ్రుతులు నొక్కుచున్నారు—మీమనస్సిప్పుడు స్థిరముగ నున్నటులు లేదు-చాలింతమా?

రోష—నామనస్సు ప్రస్తుతము చాలింపవలయుననియే యున్నది? మోహనమైన నీ ముఖమండలము—మోహనరాగముకన్న మధురముగ నున్నది. అది కనంబడునంత సేపు దీనిపయి—చేతులాడవు.

సాద—అమ్మా! అదేమి? అటులాడెదవు?

రోష—అమ్మా?—ఇదేమి—క్రొత్తమాట

సాద—నామాట క్రొత్తదికాదు గాని, నేను మీచేష్టలే క్రొత్తగనున్నవి............ఇఁక నే నింటికిఁ బోవుదునా!

రోష—కవాటము బంధింపఁబడియున్నది.

సాద—తెరచుకొని పోయెదను.

రోష—అట్లు సాధ్యమగునదిగాదా కవాటము.

సాద—అట్లయిన మీరే తెరచి నేను గృహమున కరుగుట కాజ్ఞయిండు.

రోష—మోహనా! ఇప్పుడంత తొందరయేమి?

సాద—(స్వగ) తెలిసినది. ఈమె యక్కనుసరించుచున్నది కాని, సాధ్యము కాఁగూడదు. (ప్రకా) అమ్మా! నీమాటలు నా కర్థములగుటలేదు—ఏమైన నేనింటికిఁ బోవక తప్పదు.

రోష—సుందరాకారా!—ప్రకృతియెంత శోభాయమానముగ నున్నదో-యీాగవాక్షమార్గమునఁజూడుము. పుష్పకుమారీమణులు మదభ్రంబర మధురగానమున కలరి తలలూపుచుండ—మోహనరాగవివశీకృతములయి—సారంగములెన్ని గాఢాలింగన మొనరించుకొను చున్నవో చూడుము. ప్రణయ సుఖానుభవమునకుఁ బ్రకృతియే యుదాహరణముగ నున్నదిసుమా?

సాద—(స్వగ) ఈమె పండితురాలగుటచే నేమేమో చెప్పుచు నన్నుగోతిలోనికి లాగ యత్నించుచున్నది. ఈ మందిరమునుండి బయలువడు విధానము తోచకున్నది. (ప్ర!) రోషనారా బేగం! మరియొకసారి మీతో సావకాశముగ నీవిషయమైనన రే ప్రస్తావింతును. నేను పనియున్నది. పోవలయు—

రోష—(నవ్వుచు) ఓహోహో! ఆపని యేమో నేనెఱుంగ పోలేను. వేళదాటిన మాయక్క జహానారా మీ కప రాధశిక్ష నేటిన విధించును గాఁబోలుచు

సాద—ఆమెకు సంగీతముచెప్పుట నైనది.

రోష—సంగీతముకొఱకు గాదు—

సాద—(రిచ్చపడి) మరెందుకు?

రోష—ఎందులకా? సుందర పురుషులు — సుందరాంగుల కడ కేట్టి సుఖకర సంధ్యాకాలములం దెందులకుఁ బోవుదురు?

సాద—రోషనారాబేగం—మీరు తప్పుదలంచినారు—

రోష—(నవ్వుచు) ఏమిమాటలివి ఖాన్ సాహెబ్! మీ రహస్యమును నే నెఱుఁగ ననుకొంటిరా?

సాద—మా కేమి రహస్యమున్నది.

రోష—ప్రకృతిచేత స్త్రీపురుషులు కేట్టి రహస్యముండునో అదియే.

సాద—మే మన్యోన్యము ప్రేమించుకొనుచుంటి మని మీ రభిప్రాయపడుచుంటిరా?

రోష—నీవు లేదని బొంకఁదలంచితివా?

సాద—బొంకులేల? మహారాజపుత్రిక యగు జహానారా యెక్కడ? దరిద్రుఁడనగు నేనెక్కడ? ఎంతమాటాడితిరి?

రోష—మదనసుందరాంగా! దరిద్రుడనని నీవేల పలికెదవు నీవు రూపధన సంపన్నుఁడవు—అందువలన నే మహారాజ పుత్రికల మగు మే మిరువురమును నీపాదయుగళమున శిరములుంచితిమి............జహానారకును నీకునుగల రహస్యసంబంధమునుఁ బరిపూర్ణముగ నెఱింగియు నేను వెల్లడింప నయితిని. నను జేపట్టితివా నీవీ సకలసామ్రా

జ్యమున కధీశ్వరుఁడవయ్యెదవు సంగీతమునందలి ప్రీతిచే గాదు—నీపై ప్రీతిచే నేను నిన్ను దేశికునిగ నంగీకరించి సంగీతము నారంభించితిని, రాగమునగాదు—నీయందలి యనురాగమున లీనమైతి; చింతించి—చింతించి—తెగించి-నీకృపాభిక్షువునయి యిట్లు బద్ధాంజలినయి నిలచితిని. గాఢముగ నినుఁ గామించితిని. తరుణీసహజమగు లజ్జను దూరముగ బారదోలితిని. సాదత్! స్వర్గసుఖాధికమగు నీయాశ్లేషము నాశించితిని. రమ్ము—నాకు కౌగలినిమ్ము నీప్రేమ ననుభవించుటకు—నాయక్క నోచిన నోము లెట్టివి? అట్టిపూజలందు నే నేలోపమును చేసితిని? ప్రాణ ప్రియా—మాటలాడవేమి? నాప్రార్థనముఁలం ద్రోసివేయ దలంచితివా! నన్నుచిన్నబుచ్చనెంచితివా (దగ్గరకువచ్చును)

సాద—రాజపుత్రీ! క్షమింపుము—మీరభిజాత్య సంపన్నలు నేను తక్కువవాఁడను. ఈవార్త యొకింత వెల్లడియగు నేని—నాకంఠ ముత్తరించుకొని పోవును. నాకీ విషమసం ఘటనమేల?—ఒకానొక దరిద్రగాయకునిగా నన్ను జీవిం పనిమ్ము—

రోష—ఎంత మాటాడితివి? నీకయి మానప్రాణములను-తన సర్వస్వమును సమర్పింపదలచిన యీ రోషనారా జీవ ములతోనుండ—నీవే తనయేడుగడయని నీముఖమండల మే తనకు సంపూర్ణ జ్యోత్స్నాప్రదర్శనమని యానంద కందళిత స్వాంతయగు నీ రోషనారా జీవములతోనుండ

ఒకవంక వృద్ధజననిని—మఱియొక వంక—సోదర చతుష్ట యమును—మట్టిబొమ్మలవలె నిలిపి—భారతసామ్రాజ్యమం తయు నరచేతనుంచుకొని బొంగరమువలె రాజ్యతంత్ర ముం ద్రిప్పుచు — నేకచ్ఛత్ర పరిపాలనము చేయనెంచిన యీ రోషనార జీవములతో నుండ—సాదత్ రోషన్ ప్ర ణయకథానకము బహిర్గతమగునా! అట్లు బహిరంగపఱచి జీవములతో నుండదలచిన మందభాగ్యుం డెవండు? ఒక వేళ బయల్పడునే యనుము—జహానారావలె—రహస్య జీవనము చేయుటకు రోషనారా యంత తెలివితక్కువది కాదు; బహిరంగముగ—నీవు ప్రాణనాథుడవని చెప్పె దను. నిస్సంశయముగ—నీకౌగిళ్ల బెనగియుండెద—నీకరాం గినై—నాకు రానున్న భోగభాగ్యములతో పాటు నాయు ద్రప్రాణపంచకమును నీకర్పించెదను. రోషనారాను కా దని మాట కసరించువాం డెవ్వండో చూచెదను. రోష నారా చేసినపని తప్పని వ్రేలుమడచి చూపంగలవాం డెవ్వండో చూచెదను.

సాద—రాజకుమారీ! మీరంతటివారే కాని, నాయంతరాత్మ నన్నిపనికి పుంకొల్పుటలేదు.

రోష—అవును. జహానారాను వలచుటకు మాత్రమే యుం తరాత్మ వేగముగ బురికొల్పినది! ఓ గాయకుడా! నేనా జహా నారావంటి సుందరిని కానా! దానివలె నేను నిన్ను ప్రే మింపనయితిననియా నీచింత?—

సాద—మీరిదివరకే — రెండుమూడుసారులు జహానారా మాటయెత్తితిరి. అదియంతయు కేవల కల్పితము—భ్రమాజనితము—

రోష—సాదత్ నిన్ను నేను బలవత్తరముగ ప్రేమించితినని—లజ్జాభిమానవర్జితనై వచించినను, పెడచెవిం బెట్టితివి. నాయెదుట—ఈరోషనారా యెదుట నదురు బెదురులేక, జహానారాతోడ నీకుంగల ప్రణయకథ భ్రమాజనితమని యనృతములాడ సాహసించితివి. సాదత్!—నామాట వినుము ఇది నీకు మహాప్రమాదకరముసుమా?

సాద—అమ్మా! ఏది ప్రమాదకరము?

రోష—జహానారాకును నీకును నన్యోన్యము ప్రేమలేదని దాచుటయు—నన్ను నిరాకరించుటయును—

సాద—కాదమ్మా; అల్లాముఖముచూచి నాజీవయాత్రను గడుపుదును—నాకీసంఘట్టనములు-ఈసంబంధములు వలదు ఏప్రమాదమయిన రానిమ్ము.

రోష—విమర్శించుకొనియే మాటలాడితివా! నేను రోషనారానుసుమా?

సాద—అమ్మా! ఎఱుగుదును.

రోష—అట్లయిన నీవు వెళ్ళవచ్చును—(తలుపుతీసి) సాదత్ నీవు వెళ్ళవచ్చును అయాచితముగ—తనంతట—నీపాదములపయిబడిన మహారాజుల కలభ్యమగు రోషనారాను

నీవెప్పుడు కాలందన్ని నిరాకరించితివో అప్పుడే నీనాశనము స్థిరపడినది—జాగ్రత్త—

సాద—అమ్మా! పైన పరమేశ్వరుండున్నాండు.

(ప్రస్థానము)

రోష—(రోషముతో నేడ్చుచు) సాదత్! సాదత్! వెడలి పోయితివా! నాకన్నుల కంధకారకల్పనము గావించి వెడలిపోయితివా? ఇంతనిరాకరణము ఇంతనైరాశ్యకల్పనము ఇంతకాఠిన్యము ఇంతయాశాభంగము నెన్నఁడుననుభవింప లేదు—నీ సుందరముఖారవిందమిక జహానారాపాలు గావలసినదేనా? ఆమ్మృదుశరీరమునకు కఠినమానస మెట్లు గలిగినది? రోషనారా! దౌర్భాగ్యదేవతవునీవు! కాకున్న నేకాంతముగ చేతికిదొరికిన మాణిక్యమును జారవిడుచు కొంటివి?—నీజీవితము దుఃఖభాజనము!—దుఃఖభాజనము—దుఃఖభాజనము— (రోషముతో) ఎంతకఠినుండు:—ఎట్టి ప్రార్థనమును నిరాకరించినాండు! ఎంతనలక్ష్యముం బ్రదర్శించినాండు!—ఈరోషనారా నేమనుకొనెను! కాలసర్పముం గాలందన్నినాండు—నిష్కారణముగ వానియెదుట నవివేకినైతిని!—వెకలినైతిని—బయల్పడి పరిహాసాస్పదనైతిని. అవమానింపఁ బడితిని. ప్రతీకారము చేసియే తీరవలయు. ఇదివఱ కొకవ్యక్తియే—ఇప్పుడు రెండువ్యక్తులు నామార్గమునఁ గంటకములైనవి. కంటకోన్మూలనముఁ జేసినఁగాని నాకుసుఖములేదు. ఏమిది!. శరీరము తాప

తప్తమగుచున్నది. పరాభవాగ్ని కాల్చుచుండఁబోలు— సాదతుఖాను సుందరుఁడా! కాదు, ఈకన్నులకు వాని సౌందర్యము కనఁబడదు. వానిరక్తమే యిక నాకన్నుల కానందదృశ్యము సాదత్ ఖాన్! సాదత్ ఖాన్—దురదృష్టశాలీ! రోషనారా కలుకఁగల్పించితివి; క్షణములోన నిభవిష్యల్లక్ష్మినిదన్ని వేసికొంటివి. అధఃపతనమే యిఁకనీకు గతి—జహానారా సాదతుఖానుల వినాశము చూచితీరవలయు— అంతవఱకు రోషనారాకు కంటినిండ నిద్దుర యుండదు; కడుపునిండ తిండియుండదు.

(ప్రస్థానము)

## దృశ్యము—౫.

ప్రదేశము—దారామందిరము.

ప్రవేశము—దారా—యొంటరిగ.

సమయము—మధ్యాహ్నము.

దారా—(స్వగ) వర్ష కాలమధ్యమునఁ గూడ నాకొక్కదినమున భానుఁ డెంతతీక్ష్ణముగఁ బ్రకాశించును! చరాచరజాలము నంతను తనకిరణములచే—మిత్రుఁడని పేరు పెట్టుకొని యీతఁ డెన్నిమలములమాడ్చుచున్నవాఁడు-అప్పుడే భోజనములుచేసి—దురభ్యాస పరవశులగు—మా మొఘలాయీలు తమదగ్గాలకుఁ దగినట్లు శయ్యలంజేరి నిద్రలకులోనైరి—అబ్బ! పగటినిద్ర యెంత చెడ్డది మనుష్యుని జీవితమున కింకొకటిలేదు.—(అటునిటుఁ దిరుగుచు) పార్శీభాషయోనికిఁ బరివర్తనము చేయుటకై—సంస్కృత మహావీరనాటకముం దీసికొనిరమ్మని నాకీ చెప్పినను నేఁడు—గోవిందదాసు గాని—మాస్త్రీగాని రాకున్నవారు—ద్వారమున నెవరు?

(తెరలో)

మహారాజ్! నేను షుజామహారాజ్ నౌఖరును మసావుదును—నన్ను రక్షింపవలెను—

బాబా—ఇటురా! నిన్నురక్షించు నవసరమేమి?—

మసా—మహారాజా! రక్షింపుము—

(పాదములపైఁబడును)

దారా—ఓసీ! నీకేమైనది?

మసా—సర్కార్ మామహారాజు త్రాగి..........(నాలుక కరచుకొనును)

దారా—చెప్పు—భయములేదు! ఆసంగతి నేనిదివరకే వింటిని లెమ్ము.

మసా—చక్రవర్తిగారు—మామహారాజును ఖైదు చేసిరి!

దారా—ఏమి? ఖైదు చేసిరా?

మసా—ప్రత్యక్షముగ జైలులో వేయలేదు; కాని తనమందిరముననే యుంచి కదులనిచ్చుటలేదు.

దారా—అయ్యయ్యో! తమ్మునకెంతపనియైనది—అట్లయిన నీ ఘోషయేమి?

మసా—మహారాజ్! నాకు దిక్కులేదు. మీరు మహాదాతలు. మీవంటివారీలోకమునందు లేరు—

దారా—నీవీధనముతో బ్రదుకుము పొమ్ము—

(ఇచ్చుచున్నాఁడు)

మసా—వేయిసంవత్సరములు బ్రదుకండి-మహారాజా! (స్వగ) ఈధనముతో స్వేచ్ఛగ కొన్నినాళ్లు త్రాగనచ్చును. అప్పటికింకొక మార్గమును దేవుఁడే చూపును—

(ప్రస్థానము)

దారా—(స్వగ) పండితులు రాక తడవు చేయుచున్నారు; నేనేదేని గ్రంథమును చేతఁబట్టుకొననా?............సమాకలకలము?

(మసావదు వేగముగ ప్ర॥)

మసా—మహారాజ్! మహారాజ్!

దారా—ఏమిరా యీ కోలాహలము?

మసా—కొంప లంటుకొన్నవి!

దారా—ఎక్కడ? ఎక్కడ?

మసా—ఆప్మాన్ అంతఃపురము కాలుచున్నది!

దారా—ఆ! ఆ! (పరువెత్తును)

మసా—అరరె! ఏమిది! కాలుచున్న యింట ధైర్యముగ జొరబడినాడు—ఇతనికే మహాయముగలుగునో కదా!.......ఆఁ—లేదు లేదు—ఒకసుందరిని భుజముపై వేసికొని బయటికివచ్చినాడు—ఎవరా సుందరి! ఓహో! ఆప్మాన్ బీబీవలె నున్నది—అయ్యయ్యో! పాప మీమె శరీరమంతయుఁ గాలిపోయినది—గుమికూడినజనుల నొత్తగించుకొని యిటేవచ్చుచున్నాడు—

—(ఆప్మాన్‌తో దారా ప్ర॥)—

దారా—(ఆప్మానును పరుండబెట్టి) మసావద్!

మసా—సర్కార్! ఏమిసెలవు? బీబీశరీరము కాలినట్లున్నది. నీళ్ళు తెత్తునా?

దారా—నీవైద్యము తగులబడినట్లున్నది. ఆ నూనెసీసానిటులుంచి వైద్యుని కేకవేయుము. బ్రదుకునో లేదో!—

మసా—చిత్తము. (పరువాఱిలును)

ద్వితీయాఙ్కమ్.

# తాజ్ మహల్.

## తృతీయాఙ్కమ్.

### దృశ్యము—౧.

ప్రదేశము—దారా మందిరము.

ప్రవేశము—వ్యాధిగ్రస్తయగుఆష్మాన్—దగ్గఱదారా.

సమయము:— సాయంకాలము.

ఆష్మా—యువరాజా! మీదయ యపారమైనదిగదా!

దారా—ఎందుచేత? ఆష్మాన్!

ఆష్మా—నేను మిగుల కాలిపోయితిని. శరీరమంతయు నగ్నిహోత్రముచేదహింపఁబడెను—అట్టినేను—మీదయచేత నే తిరిగి జీవింపఁగంటిని—

దారా—అంతయు పరమేశ్వరేచ్ఛ—

ఆష్మా—మీరు మిగుల శ్రమపడుచున్నారు; దినదినమును రాజకార్యములుగాని—విద్యావ్యాసంగములుగాని — లేక, మిగులవ్యగ్రులై-దురదృష్టవంతురాలనగు నాతోసమముగ కాలముగడుపుచున్నారు!

దారా—ఆష్మాన్! నాకిదియెంతమాత్రమును, నీవనుకొొని నట్లు—కష్టముగలేదు; నేనునిరంతరము నీసమీపముననే

కూర్చుండఁగోరుచుందును. నాకిందే యానందమున్నది. నీముఖమండలము చూచినకొలఁదియు మూకమనసగు నందలిమాధుర్యమును గ్రోలుటయందు నాకన్నులకెప్పటికి తనివికలుగునో చెప్పఁజాలను.

ఆష్మా—నేను నిజము చెప్పుచున్నాను. దయామయులగు మీ చల్లని మాటలవలనను, సుఖదాయకమగు మీ మృదుహస్తపల్లవ సంస్పర్శమువలనను — ఆనందపూర్ణమగు మీ మూర్తిసాన్నిధ్యమువలననే — నా వ్యాధిమరలినది గాని, నామమాత్రములగు నౌషధములవలనఁగాదు—

దారా—నిన్ను విడిచిన కొలఁది కాలమే నాకుమిగులదుర్భరమై తోచుచుండును. ఆష్మాక్! మన స్నేహవిశ్వాసములు భగవత్ప్రేరణచేఁగల్గినవి. మనమిట్లు జన్మాంతము కలసి యుండునట్లనుగ్రహింపుమని నేను నాప్రాతఃసాయం ప్రార్థనములయందెల్లను స్మరించుచుందును.

ఆష్మా—వ్యాధి నయమగుచున్నదని నాకెంతమాత్రమును సంతోషము గలుగుటలేదు—

దారా—ఏందుచేత? ఆష్మాక్—

ఆష్మా—యువరాజా! చెప్పినననవ్వెదరేమో — నా వ్యాధి నిశ్శేషమైనచో—మీదర్శనము లభింపదని నేనువిచారించుచున్నాను.

దారా—(చిఱునవ్వునవ్వి) వెఱ్ఱిదానవు—

ఆష్మా—ఆవెనుకనున్నగవాక్షమునుండి బయటకు జూడుడు కాలిపోయిన స్థలముననే పునర్నిర్మాణము చేయబడుచున్న నామందిరము! చక్రవర్తియనుగ్రహముచే నది మాను పూర్వకన్న నత్యంతరమణీయముగ గట్టబడుచున్నది అందు సందేహము లేదు—ఐనను నామనస్సునకా మందిరము, నరకము వలెదోచుచున్నది. మరల నదితూల దహింపబడునని నేను విచారించుచున్నదానను. ఆమందిరమును నిర్మించు పనివాండ్రను—నే నీశయ్యపై నిల్చి పరుండి చూచుచు, ననేక లక్షలపర్యాయములు శపించుచుందును.

దారా—నీ కెందుల కంత క్రోధము?

ఆష్మా—నామందిరము కాలిపోవుట నాశరీరము మహాగ్ని జ్వాలలో దహింపంబడుట నాయానందమునకే మైనవి—అట్లు జరుగకున్నచో—

దారా—జరుగకున్నచో—నేమైయుండును? అంతతో నిలిపి వేసితి వేమి?

ఆష్మా—జరుగకున్నచో—మీపరిచయము గలుగదుకదా!—మరల నామందిరము కట్టిరేని—నేను బలవంతముగ మీ సముఖమునుండి విడదీయబడి, నామందిరమునం జేర్పం బడెదను.

దారా—అప్పుడుమాత్రముం నాకిష్టమున్నచో — నిన్ను చూడవచ్చుటకు నన్నభ్యంతరపఱచువారెవ్వరు?

ఆష్మా—అప్పుడీదీనురాలిని మీరేల చూడవత్తురు?—

దారా—ఇందులకే నీవు బాలలలో మేలవు.

ఆష్మా—కొన్నినాళ్ళక్రిందట – మహారాణి నాతో నొకపర మార్థమైనమాట చెప్పినది,

దారా—నేను వినఁదగిన దేనా?

ఆష్మా—వినఁదగినదే కాని—యాక్షేపించెదరేమోయని—

దారా—అని—నీసంశయమా?

ఆష్మా—ఔను.

దారా—సంశయములక్కరలేకుండ చెప్పుము

ఆష్మా—నన్ను పెంచుచున్నది—తనకు కోడలిగాచేసుకొనునట కట! (సిగ్గుపడుచున్నది)

దారా—ఇంతేకద! ఈమాట నాతోను చెప్పినది మా యమ్మయేకాదు; తండ్రిగారుకూడ నట్టి సంకల్పమునందే యున్నారు.

ఆష్మా—అందులకే—మీరు నాదగ్గరఁ గూర్చుండియున్న ప్పుడు చక్రవర్తియు రాణిగారును వచ్చిరేని నాకు చచ్చి న చావుగానుండును.

దారా—అరుగో! అమ్మగారు—నాయనగారు!

(షాజహాన్—ముంతాజ్ (ప్ర॥)

ఆష్మా—ఏరి? ఏరి? (లేవఁబోవును)

షాజ—ఈస్థితిలో నధికమర్యాదలెందులకు?—పండుకొనుము-పండుకొనుము..............అదెగో! పెద్దబాబిక్కడనే

యున్నాఁడా ఇఁకనేమి? (చిరునవ్వునవ్వును)

ముంతా— బేగీ! నీ స్నేహితులందరును సుగుణమే కదా!

ఆష్నా— కమనయ చేత—

పాజ— ప్యారీ ముంతాజ్'—శస్త్రవైద్యమునందు మనకన్న నాంగ్లేయులే మిగుల సమర్థులని తోఁచుచున్నది—

ముంతా— ఔను; మన ఆష్నాక్ శరీరమును బాగుచేసిన యాంగ్లేయులకు తమ రేబహుమానము నీయఁదలంచితిరి?

పాజ— వారు "ఈస్టిండియా కంపెనీవారి మనుష్యులు" సీమ దేశమునుండి వర్తకమునకై వచ్చినవారు. నేను మొన్నటి దినమునఁ గొంతధనము వారికి పారితోషికముగ నీయఁబోవ—వారు వలదనివారించి,—"ఇప్పుడు బహుమతుల తొందర యేమి? ఐనను ధనముతో పనియేమి? పూర్ణముగ నయము గానిండు—చూచుకొందము" అని పలికిరి. వారిమాటల నైఖరిఁజూడ మనవలన నేదియో గొప్పబహుమానముం గొనఁదలఁచినట్లున్నది.

ముంతా— వారు చేసినపనికే బహుమానమైన నీయఁదగినదే!

పాజ— నేను నటులే సంకల్పించితిని.

దారా— అదుగో వారేవచ్చుచున్నారు!

(ఆంగ్లేయులు ఇద్దఱు ప్ర॥)

ఆంగ్లే— సలాం—బాదుషాసర్కార్—

పాజ— సలాం దొరగర్లు—కూరుచుండుఁడు.

ఆంగ్లే—ఈదినము కొంచెము సుగుణమేగదా?

షాజ—ఆ!—సుగుణమే—

ఆంగ్లే—ఇంక పట్టికలు వేయనక్కఱలేదు—పైన రాయు తైలమును మరింత పంపెదము. దానివలన పరిపూర్ణముగ నయమగుడు.

షాజ—తమశ్రమకు నే నేమియునిచ్చి తీర్చుకొనజాలను; ఐనను—యథాశక్తి—నేనానాడు మీకీయఁబోయినదానిని స్వీకరింపరైతిరి. మీయుద్దేశమును వినఁగోరెదను—

ఆంగ్లే—(ఒకరి మొగ మొకరు చూచుకొందురు)

షాజ—మీరు సందేహింపవలదు; ఏకోరికమైనఁ దీర్పఁ వాఁడను.

ఆంగ్లే—మాకంపెనీవారికి—కాళీ ఘట్టమున గిడ్డంగికావలసియున్నది. అందులకా స్థలమున గిడ్డంగికి సరిపోవుభూమిని దయచేయుఁడు.

షాజ—అట్లేయిచ్చితిని—తృప్తినందితిరా? ఇంకేమైన వలసిన నడుగవచ్చును.

ఆంగ్లే—మహాప్రభూ! తృప్తినందితిమి. ఇప్పటికిది చాలు.

(తెరవాలును)

## దృశ్యము—౨.

ప్రదేశము—రోషనారా మందిరము-

ప్రవేశము—రోషనారా.

సమయము—సాయంకాలము.

రోష—(తనలో) ఇఁకను ప్రొద్దుగ్రుంకలేదు; భళీ — రోషనారా! భళీ! నీ మాయాతంతువులయందు నేటిరాత్రి సాదతుఖాను నశియించునుగాక!—అనంతరముగాని జహానారా సంగతి తెలియఁబడదు.........................జహానారా వ్రాసినట్లొక జాబువ్రాసి, సాదతుఖానునురమ్మని సాంకేతికస్థలము నేర్పఱచితిని. చీకటిలో సాదతుఖాను వచ్చునప్పటికి—రోషనారా వానిఁ బరిమార్పఁగలదు; ఓ దురదృష్టవంతుఁడా! సాదతుఖాన్! నీప్రాణములిప్పుడు యమపురద్వార సమీపముననున్నవి! పాముతో పగడలచితి. నీకు క్షేమమెక్కడనుండివచ్చును?—కటకటా! సుధాకరమండలమువలె చల్లనై—శాంతమై—కాంతిమంతమై మనోహరమైన నీవదనసౌందర్యమును నేనుచేతులార నేలపాలు గావింపవలసివచ్చినందులకు నాకమితవిచారమ్ముగనున్నది! ఏమిచేయుదును? బడబానలమును ప్రజ్వరిల్లఁజేసితివి—అగ్నిపర్వతమును బ్రద్దలుచేసితివి? నీప్రాప్తికి నేనేమిచేయుదును? నీకు మరణముతప్పదు — జహానారా వలపులకులోఁబడి నన్నుఁ దృణీకరించిన నీకు నేను ఘోర

మరణము తప్పదు—నీ జహానారా యిష్టపడ్డను వచ్చెనే మోసపోవుకొనుము—జహానారా యాశాబీజము నిర్మూలనము గాక—సాదతుఖానీ ప్రపంచమును విడి యుద్వాసము గుగాక! రోషనారా మనస్సు చల్లబడుగాక!

(ప్రస్థానము)

## దృశ్యము—3.

ప్రదేశము—సాదతుఖాను మందిరముముందర

ప్రవేశము—జహానారా

సమయము—జాము రాత్రి వేళ

జహా—(అటునిటు భయముతోఁ జూచుచు) అయ్యయ్యో? నేనెంత సాహసించితిని!—రాజపుత్రికగు నేనిటికివేళ మందిరము వదలి—మేలిముసుంగు చాటున బయట సంచరించుట మిగుల ప్రమాదముగదా! జగన్మోహనాకారుఁడగు సాదతుఖానుపైనున్న ప్రేమ నన్నులాగుకొని వచ్చినది. కుటిలమతియగు రోషనారా యింతకుమున్నే—మా సంయోగము గని కన్నులలో కారము చల్లుకొను

చున్నది! ఇట్టివేళ నేనిక్కడ దానికన్నులలోఁ బడితినేని నా జీవితానందజ్యోతి యారిపోవలసినదేకదా! సరే! ఇట్టి యాలోచనములతో వ్యర్థపుచ్చఁదగిన కాలముగాదు—ఇదే సాదతుఖానుమందిరము!.........ఈ సాయంకాల మీతఁ డేలనో మన్మందిరమునకు రాలేదు. నాకు రోషనారా తనతోడ మోహసంభాషణము సలుప నిరాకరించితినని యాతఁడు నాతో చెప్పినప్పటినుండియు—ఘోరసర్పస మానయగు రోషనారాయందు నాకు భీతియే కలుగు చున్నది. ఇది యేదైన దానికపటమైయుండునా? కను గొందును.........................ఇచ్చట నెవ్వఁడో యొక సేవకుఁడు ప్రచారము చేయుచున్నాఁడు! వీనినడిగె దను—(బిగ్గరగ) ఎవరక్కడ?

సేవ—(ప్ర॥) మీ రెవ్వరు?

జహా—నేనెవ్వరైన నీకేమి? —మీ యజమానుఁడెక్కడ?

సేవ—ఎవరు? (పరికించి) ఆహాహా! ఏమిభాగ్యము! జహా నారా బేగం సాహెబా—

జహా—(స్వగ) అరే! వీడొక్కనన్ను గుఱుతించెను.

సేవ—మీ రేమియు సంశయింపవలదు. తెమపటము మా యజమానుని దగ్గఱనున్నది. అందుచేగుర్తింపఁ గలిగితిని; మీ కపాయము తొలఁగినట్లేకద!

జహా—అపాయమనుచున్నావేమి? మీయజమానునెక్కడ

సేవ—ఏమిది! చిత్రము! మీరపాయములోనున్నట్లు వెంటనే రావలయుననియు సాదతుఖాన్ సాహెబునకు వ్రాయలేదా?

జహా—(విస్మయముతో) నేనా? ఎప్పుడు?

సేవ—సాయంకాలమున—అదిచూచుకొని యాయన ఢిల్లీ ఆగ్రానడుమనున్న చీకటితోటకరిగెను.

జహా—ఆహాహా! ఏదియో మోసము సంఘటిల్లినది; ప్రతిదినమువలె—నీయంద్రాయన సంగీతసారమునకు నాకడకు రామింజేసి నేనుసహించి యుందుపచ్చితిని. ఇంతకన్న నేనధికమెఱుంగనే! నాకపాయమేమి?

సేవ—ఎవరో శత్రువులట్లు వ్రాసిరని తలంపవలసి వచ్చుచున్నది

జహా—(ఆలోచించి) మంచిది—సేవకా! నీవింటిలోనికిఁబొమ్ము నేను తరువాత జరుగవలసినపని చూచుకొనెదను.

సేవ—చిత్తము—(నిష్క్రమించును)

జహా—(స్వగ) ఇది తప్పక రోషనారా మాయాతంత్రము! ఈదుష్టురాలికింత కౌటిల్యమేల?—నేను వ్రాసినట్లిది యేలేఖ వ్రాసియుండును—సేవకుండేమిచెప్పెను; ఢిల్లీ ఆగ్రాల నడుమనున్న చీకటితోటకరిగెనని కదా—కటకటా! అట్టి

నిర్జనమ్మైనవగు భయంకరప్రదేశముల కీయన, నిశివేళ నొంటరిగ నెందులకేగవలయును? ఏదియో దారుణ కార్యఘటనముకొరకైయున్నది. ఇప్పుడు నేనూరకుండఁ గూడదు, ఏమైననగు—నా ప్రాణేశ్వరుని ప్రాణసంరక్షణ మునకై—నేనిరాత్రి యెట్టి కష్టపరంపరలనైన గణింపను. ఎట్టి దుస్తరాపాయములనైన నెదుర్కొనెదను—నడుమున నున్న కఠారి జాగ్రత్తగనేయున్నది; ఎందులకైన మంచిదని దీసికొనివచ్చుట బాగుగ నుపయోగమైనది. రోషనారా—నీవు నన్ను సాధింపలేవు——

(ప్రస్థానము)

## దృశ్యము—౪.

ప్రదేశము—ఢిల్లీ ఆగ్రాలనడుమ బగీచా.

ప్రవేశము—కల్లనిదుస్సులతో-రోషనార.

సమయము—అర్థరాత్రి.

రోష—(స్వగ) గంభీర కాలాకారధారిణియగు నిశాంగన నాకు తోడగుఁగాక! ప్రళయాంతక సదృశుఁడై—విశాల భీకర కరాళముం దెఱచుకొని — భూతసంహారాభీల బ్రహ్మాండ మండలవ్యాప్త మహాకారుఁడగు కాలపురుషుఁడు నాకు హెచ్చరికలు చెప్పుఁగాక! యమధర్మరాజు నా కైదండ నుండుఁగాక!—మృత్యుదేవత నా కృపాణాగ్రమున నివసించుఁగాక!—భూతభేతాళ సంతతులారా! నాకు మీరు పరిజనులు— ఈ రోషనారయే నేటిరాత్రి భైరవీశక్తి—ఈ కాత్యాయని నెవ్వఁడు నెదురించి నేడు గెలువలేఁడు;— రోషనారా భారత రంగక్షేత్రమున నారంభించిన—వీరశత్రు సంహార మహానాటకమున కిదియే నాందీశ్లోకము—రోషనారా మానసమా! జన్మము వలన గలిగిన యబలత్వమును వదలుము; ధైర్యమా! నేను నాయందు మూర్తీభవింపుము—నా ప్రియకరవాలమా! సాదతుఖాను రక్తముచే ..................ఆహా! ఈ యంధకారమధ్యమున సుందరమగు సాదతుఖాను ముఖమండలము నా కన్నులకగుపడుచున్నది. ఈ యాకృతినా నేను వధింపఁదలఁచినది!—

రోషనారా—రోషనారా!—నీవు, నిజముగ రాక్షసివి! నీకు దయలేదు; నీ మానసము వజ్రతుల్యము!—సాదతుఖాను! నా హృదయ ధనచోరా!—నాతోడ నేల విరోధము బూనితివి?—నన్నేల నిరాకరించితివి?—నిరాకరించి యేల నీప్రాణములమీదకిఁ దెచ్చుకొనదలఁచితివి! జహానారా నికేమి మందుపెట్టినది!—ఔను—నీపై జాలివహింపఁగూడదు; జహానారా ప్రియుఁడనగు నిన్ను ముక్క-ముక్కలు చేయవలసినదే—ఛీ! చంచలహృదయమా! సాదతుఖాన్ సౌందర్యమునకు లోఁబడి పోవుచుంటివా!—సాదతుఖానెవఁడునీకు?—(భీకరముగ) ఎవఁడు నీకు సాదతుఖాను—నిన్ను నిరాకరించిన క్రూరుఁడు—నేను నీదాసనని పాదములఁబడిన యబలను—దయారహితుఁడై త్రోసి వేసిన కలుషకర్ముఁడు-నేను రోషనారానుసుమా! యని పలుక—ఔను అది నేనెఱుఁగుదు నని ధైర్యశాలి—ఆ సాదతుఖాను ధైర్యమును—నిర్లక్ష్యమును—నిరాకరణమును—దురహంకారమును—నేను రోషనారా విస్మరించనుగాక!—సంగీతపాఠములు చెప్పుకొనుసామాన్యదరిద్రుఁడు—మహా రాజపుత్రికను నేను—అట్టి నన్ను తృణీకరింపఁ వాఁడెంత వాఁడు—కానిమ్ము; వినాశము సిద్ధముయినది.....ఎవఁడో యీవంకకు వచ్చుచున్నవాఁడు సందేహములేదు వాఁడే—జాగరూకతగ నుండవలయును.

—(సాదతుఖాను ప్రవే॥)—

సాద—(స్వగ) అబ్బ! ఎంత భయంకరముగనున్నది——ఇది నిర్మానుష్యమగు ప్రదేశము! సాంద్ర వృక్షసంతానములచే ప్రకృతి మరింత భీషణముగఁ గనఁబడుచున్నది. వెలిమబ్బు నభోభాగముం గ్రమ్ముకొనినందున నక్షత్రకాంతియు లేకుండఁబోయినది—నా మనోవాంఛితం బేమి యుపాయము రానున్నదో తెలియదయ్యె—అంతయు నాశ్చర్యకరముగనున్నది. మాపై నిష్ఠురంబూని యున్న రోషనారా యేమైన జహనకపాయముసేయఁ దలంపలేదుగద! ఇది బగీచా దరవాజా—దీనిం దాటితిని—లోపల నెవ్వరో యున్నారు! ఒకవేళ జహనారా కాదుగదా! ఎవరువారు?

రోష—(స్వగ) ఆహాహా! ప్రకృతి మధురమగు నీతనికంఠస్వరము నాచెవులఁబడినంతనే హృదయము కరఁగి నీరగుచున్నది. ఈ యేకాంతప్రదేశమున నీమహాపురుషుని సాన్నిధ్యము ననుంకుటచేసి-నా హృదయము రాగరసంబున తేమై—ద్రవించుచున్నది; ఒక్కమారీతని బలవంతముగఁ గౌగిలించుకొని ముద్దిడుకొందునా! (దగ్గఱకుఁ బోవుచున్నది)

సాద—ఈ యంధకారమున, నిరుత్తరులై యున్నవారెవ్వరు

రోష—(కౌగిలించుకొని) మనోహరా! ఇది నీ ప్రాణము రోషనారా!

సాద—(తత్తరముతో వదలించుకొని) ఎవరువారు? రోష
నారా? ఏమి యీమోసము?

రోష—మోసమేమున్నది? ఎటులయిన నీసాంగత్యభాగ్యము
లభించినఁ జాలునని—జహానారా వ్రాసినట్లు లేఖవ్రాసి
నిన్నింతవు రప్పించితిని. నాయనురాగ ప్రాబల్యమును
నీమనమునఁ గలఁచి నన్ను—నీదాసిం జేసికొనుము. నీకై
నిద్రాహారములను మానితిని. బాదుషాకుమారినై యుండి
యు నీకొఱకై—నిర్మానుష్యాంధకార నిశీథముల నేకాకి
నై సంచరించుచుంటిని—సాదత్? ఇంకనైన నీహృదయ
ము కరుగదా?

సాదత్—అటులైన, నాజహానిందు రానేలేదా? ఇదియంత
యును నీద్రోహమేనా?

రోష—(స్వగ) నాజహాన్?—నీజహానేమి? దురాత్ముఁడా?
నీకింకను జహానుపై ప్రేమయణఁగలేదు—(ప్రకా) సాదత్
ఇదిద్రోహముకాదు; నీపైఁగల యనురాగము.

సాద—అనురాగమా! ఛీ— తుచ్ఛురాలా! ఏమిపనిచేసితివి!
ఎంతసాహసించితివి? ఎంతకుఁ దెగించితివి? ఎట్టికపట నా
టకముం బ్రకటింపఁదలఁచుచుంటివి? అనృతవార్తలు
కల్పించి—అనృతలేఖ వ్రాసి—అంధకారమధ్యమునకు నన్ను
రప్పించి, మోహనాటకము నాడుచుంటివా? ఛీ! ఛీ! నీకిది
యేటిగౌరవమని తోఁచెను! నీవు కోటిప్రయత్నములుచేసి

నను, నాసన్మతింబడయఁజాలవు. నీదొంగయుత్తరమును నమ్మి—యెంతశ్రమ నందితిని—

(మరలిపోవును.)

రోష—(స్వగ) కటకటా! ఎంతపరాభవమైనది!—ఈ దురాత్ముఁడు రెండవమారు నన్ను నిరాకరించిపోవుచు—ఛీ—వాని ననవలసినపనియేమున్నది. కనుపడినంతోడనే కటారిపోలు నేయక—మెత్తబడిన నన్నే నిందించుకొనవలయును. (ప్రకా) సాదత్! ఎక్కడికి?

సాద—రోషనారా—నాతోనీవిక విశేష ప్రస్తావనముచేయకుము—నేను గృహాభిముఖుఁడ నగుచున్నాను.

రోష—సాదత్? విను—విను—నేను రోషనారానుసుమా!

సాద—ఔను—నీవు రోషనారావే?—

రోష—(కోపముతో) ఔనురా? దురాత్ముఁడా నేను రోషనారానే—నీపాలిటి కాలమూర్తిని—మృత్యు దేవతను—నేనురోషనారానే—ఇదిగో మూఁడు చచ్చితివి; నీవింక లేవు (గుండెలలో పొడుచును)

సాద—(క్రిందబడి కొట్టుకొనుచు) హా—హా—శాకినీ—రోషనారా—

రోష—ఆహాహా! రక్తము చక్కగస్రవించుచున్నది. సాదత్ తెలిసికొంటివా? రోషనారాను నిరాకరించినవారందఱిగతి యింతే—ఇప్పుడు నీజహానారాను దలంచుకొనుము.

సాద—హా—హా—రోషనారా—పాపస్వరూపిణీ?-ఎంతదుష్కర్మ మాచరించితివి.....ప్రాణ హంతకీ!...............
జహాన్—షాజహాన్—నివేన్నైపోవుచున్న—నాదుర్గతి నీకు వచించువాడైన నిక్కడ లేరు—

రోష—ఛీ? చండాలుండా? ఇంకను నీకు జహానారా నామస్మరణము తప్పలేదుగా?—తొందరపడకు—అల్పకాలములోనే, జహానారాను కూడ నీదగ్గరకు పంపుచున్నాను-

సాద—ఓక్రూర రాక్షసీ? స్త్రీ హత్యాపాతకురాలవా? ఇంకను నీ హత్యాదాహముణగలేదుగా?...హా! హా! బాధ-అల్లా-దయాళువా—పర్వర్‌దిగార్—

రోష—రోషనారా పరాభవమునొందదు—అనుభూతమగుచున్నది.

సాద—ఓసీ! దయావిహీనురాలా!—ఈకటారిని గుండెలోనుండి తీసివేసి పుణ్యముగట్టుకొనుము—

రోష—నిరాటంకముగ మరణింపుము (కటారితీసివేయును)

సాద—హా హా—(మరణించును)

రోష—ఈదౌర్భాగ్యుడు చచ్చినాడు; రోషనారా జీవితము నందలి ప్రథమహత్యయిదియే. ఇంక నాకిక్కడనేమిపని? .......అయ్యో! ఎవరో యిటు వచ్చుచున్నారు. నేనీరక్తపు గుడ్డలతో నిచ్చట కనబడగూడదు.

(ప్రస్థానము)

(జహానారా ప్రి)

జహా—ఏమి యీమహామాయ? ఈఘోరప్రదేశమున నెన్నిహత్యలుజరిగిన నేమిగతి? ఇట్టి చోటికా సాదతుఖాను వచ్చినాడు......ఆ! ఏమిది?-ఎవ్వరీసమీపమునుండి పరు వెత్తిన రీతినయ్యెను—మా సాదతుఖా నిక్కడ? అంతయు నంధకారము —ఏమియుఁగనఁబడదు!-(కాలి కేదియోతగిలి నట్లభినయించి) ఆ! ఇదియేమి? నాకాలి కేదియో మెత్తని వస్తువు తగిలినది—మనుష్య శరీరమువలె నున్నది. అరరె — ఈతడియేమి? ఆహా ఇదినిస్సందేహముగ రక్తమే—ఇది యొకవేళ మా సాదతుఖాను శరీరము కాదుగదా—హార హర—నాకెట్టి పాపపుతలంపు గలిగెను—నాశరీరముభయ కంపితమగుచున్నది. ఇదిశవమే—నిక్కముగ శవమే— హా హా హా హా ఈయంధకారమున నీ ఘోరహత్య గావించినవారెవ్వరో. ఈ శవసమీపమున నుండుటచేత నాశరీరము గడగడవణకుచున్నది. కన్నులుతిరుగుచున్నవి శిరస్సు భారమగుచున్నది— హా హా —సాదత్ —ఘోర హత్య—శవస్పర్శ—రక్తప్రవాహము—

(మూర్ఛిల్లును)

(తెరవాలును)

# తాజ్ మహల్.

## చతుర్థాఙ్కమ్.

### దృశ్యము—౧.

ప్రదేశము—రోషనారా మందిరమునందలి చావడి.

ప్రవేశము—రోషనారా.

సమయము:—ఉదయము.

రోష—ఊరంతయు నగ్నిలేకుండ దహించుకొని పోవు చున్నది. సాదతుఖాను మరణవార్త యెక్కడఁ జూచినఁ జెప్పుకొనుచున్నారు. చక్రవర్తి—రహస్య పరిశోధకులచే హంతకుని వెదకించుచున్నాఁడట! ఇంటిదొంగ నీశ్వరుఁడు పట్టఁగలఁడు? జహానారాకు పిచ్చియెత్తినది! కాని దీని హృదయమర్మమందఱకుఁ దెలిసిపోయినది; ఆరాత్రి హత్యాదినమున నచ్చట నాకు చీకటిలోఁ గనఁబడిన వ్యక్తి జహానారాయే—అహ్హ! అహ్హ! రోషనారాశక్తి!...... (మేడపైనుండి క్రిందికిచూచి) ఎక్కడికిపోయెన?............ ఓహో మఱచితి! నేఁడేకదా—సుబేదారులుగా రాజకుమారులా యాదేశమునకరుగునది—ఔరంగజేబు దక్కనుకరుగుచున్నాఁడు! మురాద్ గుజరాతు దేశమునకరుగుచున్నాఁడు

ఇక షుజా మాటయేమి? షుజా యిందే బంధింపబడి యున్నాడు పాపము!—తెలిసికొందునుగాక!............
ఆహా! సేనలెట్లు చీమలబారులవలె సాగిపోవుచున్నవో...
ఈ దృశ్య మానందకరముగ నున్నది.

(ఖాజీ ప్ర॥)

రోష—ఎవరది—(చూచి) ఖాజీసాహెబు! నమస్కారము! విశేషములేమి?

ఖాజీ—ఏమున్నవి?...క్షేమమేనా?.........

రోష—నాతో నేమి? సంశయింపనక్కఅలేదు; వచ్చిపుడు

ఖాజీ—తనుతో నొకసంగతి చెప్పవలయునని వచ్చితిని.

రోష—ఏమి?.........ఇచ్చట నెవ్వరునులేరు రహస్యమైనను చెప్పవచ్చును.

ఖాజీ—ఆస్మా బీబీ—అగ్నిలో బడకపూర్వము, చక్రవర్తిని—నన్ను పిలువనంపినారు—

రోష—తరువాత—

ఖాజీ—ఆస్మా—అప్పుడామె సన్నిధినేయున్నది. చక్రవర్తిని నన్నుజూచి అయ్యా! నా పెద్దకుమారుడగు దారాను, చిన్ననాటనుండియు నేనుపెంచిన యీ యాస్మానిచ్చి వివాహము చేయవలయునని సంకల్పించినాను; ఈ బాల హస్తమున నాయనంతరమున చక్రవర్తినిగాదగిన రేఖ కలదో లేదో చూచి చెప్పుడని యడిగెను.

రోష—ఏమీ? చక్రవర్తినికెంత పక్షపాతము; ఇందులకే రోషనారా యందఱకును చెడ్డదైపోవుచున్నది; ఇట్టి గుణములంజూచిన నాకొడలు మండిపోవుచుండును.—ఏమీ— ఈ బానిసదానిని—మా పాదధూళియంతమాత్రపు విలువసైనం జేయని యాతొత్తును—మాయమ్మ తనయనంతరము చక్రవర్తినిం జేయఁదలఁచుకొన్నదా? పాపమెంత వెఱ్ఱిభ్రాంతి పెట్టుకొన్నది?—దారాచక్రవర్తి—ఆమ్మాక్క చక్రవర్తిని!—అందులకే కాఁబోలును, పాప మీనడుము దానికి శరీరముకాలి చావ సిద్ధమైనప్పుడు—కొఱతదగ్గఱ నక్కవలె—మూప్మానుసంటిపెట్టుకొని కూరుచున్నారను. ఛీ; ఛీ;—ఎంతిమురాలోచనము (ప్రకా) ఖాజీసాహెబ్— తరువాత మీ రేమిచెప్పితిరి?

ఖాజీ—(స్వగ) ఈమె మీరాలోచనలో పడినది కొంచుపొముని ప్పుడే తగిలించెదను. (ప్రకా) అమ్మా! చక్రవర్తిని యట్లనుచుచుండఁగా—నేమనవలయును? — అప్పటికివారి యుక్తి ప్రకారమే చెప్పితిని కాని యొకదుష్టగ్రహము ముగనున్నదని చెప్పితిని.

రోష—(స్వగ) ఆదుష్టగ్రహమే రోషనారా (ప్రకా) ఔను ఆశ్రితుల కట్లు చెప్పుటయే యుక్తమము

ఖాజీ—అమ్మా! ఈనడుమ చక్రవర్తిగారేమైన రత్నాభరణములను కొనిరా?

రోష—ఏమి?

ఖాజీ—కొన్నసంగతి మీరెఱుఁగుదురా?

"అమ్మగారికింత పక్షపాతమా?"]

రోష—ఆ—ఇప్పటికి మూడు నెలల క్రిందట — గోదావర్తికుల వద్ద—చక్రవర్తిగారు — లక్షరూపాయలు విలువచేయు రత్నహారమునొకటి కొనిరి—దానిని మాకెవ్వరికీయక తండ్రిగారు మాయమ్మగారికిచ్చినారు.

ఖాజీ—ఓహో! అటులనా? ఇప్పుడు నాసంశయము విడిపోయినది!

రోష—నీసంశయమేమి? విడిపోవుటేమి?

ఖాజీ—అమ్మా! ఏమున్నది?—కాలగతి!!-ఇనపారికాకులకో కానివాండ్లకు కంచములలో—

రోష—ఖాజీసాహెబు! మీమాటలు నాకర్థములగుటలేదు, స్పష్టముగ మాటలాడుఁడు; ఆరత్నమెవ్వరికైననీయఁబడినదా!

ఖాజీ—ఎవ్వరికీయఁబడినను నాకుసంతోషముగనేయుండును కాని..........అనగూఢముగా ని—అమ్మగారికింత పక్షపాతముగూడదు.

రోష—అమ్మగారు లక్షరూప్యములు చేయు నారత్నహారమును నీచులపాలఁబడవేసిరా?

ఖాజీ—మొన్నటిముండ—పులియాకులలోనియన్న మేకాని తినుదరిద్రులు గన్నది—అప్పామ్మక—దానిని పెంచినఁ బెంచవచ్చునుగాని, నెత్తిపై నెక్కించుకొందురా? గర్భవాసమునఁగన్నకుమార్తె లాడుపుట్టుకంబుట్టినవారుగారా? వారికి రత్నాభరణములనుధరించుకొందమను నానందముగానియభిలాషముగాని యుండదా?—ఆయభాగ్యరాలికిఅదరిద్రు

రాలికి లక్షరూప్యములు విలువచేయు—రత్నహారము నిత్తురా? ఎంతయన్యాయము—నత్తగుల్లలు కంఠమున-మణిహారములు బుగదగునా? ఇంతకు—భగవంతునకు బుద్ధిలేదు—

రోష—ఖాజీసాహెబ్! ఈ మాటనిజమేనా?

ఖాజీ—తల్లికి కూతురుపై నుండనగిన యనురాగమిట్లు తారుమారైనందులకు విచారించుచుంటినిగాని—అమ్మా!—అబద్ధమాడుటకు నాకేమికర్మము—

రోష—సరే! మీరింక మీపనిమీదనుండుడు—క్రిందటి మాటు మీకెంతబహుమానము చేసితినో—మీకు జ్ఞాపకమున్నదిగాదా! ఇట్టివిషయములను బోనీయక నెప్పటి కప్పుడు నాకెఱుగఁజేయుచుండుడు—పోయిరండు—నాకు పనియున్నది.

ఖాజీ—(ప్రస్థానము)

రోష—(పండ్లుకొఱుకుచు) ఒకముండను కోరలుదీసిన పాముంజేసి విడిచితిని; అంతతో నామార్గము నిష్కంటకము కాలేదుకదా! మరల నీతొత్తొకతె దాపురించినదా?—దీని నాశనమునకే వ్యూహమొకటిపన్నవలయు—సాలెపురుగు పన్నిన తంతువులంబడి యీగలు నశించునట్లు—దురాత్ములొక్కొక్కరుగ—రోషనారా తంత్రవశునంబడి నాశనము కావలయును.

(ప్రస్థానము)

## దృశ్యము—౩.

ప్రదేశము—ముంతాజ్ మహల్ మందిరము.

ప్రవేశము—ముంతాజ్, రోషనారా

సమయము—సాయంకాలము.

రోష—జహనారా సంగీత విద్యాపరిశ్రమకుఁ గారణము మీకిప్పటికైన బోధపడినదా!

ముంతా—బిడ్డా! అదేమిమాట—ఇప్పుడది యున్మాదినియైన దని......నీవుమాత్రము సంగీతమును నేర్చుకొనలేదా.

రోష—నేనా దురాత్మునకు చనువిచ్చితినా? — వానికొఱ కేడ్చితినా?—ఉన్మాదినినైతినా?

ముంతా—ఏదో! దానికర్మగతి యట్లయినది.

రోష—ఇదిమన జనానాకెంతైన నవమానకరముగనున్నది.

ముంతా—(మాటమార్చి) సాదతుఖాను ఖూనీమాత్రమాశ్చర్యకరముగనున్నది!

రోష—హంతకుఁడెవ్వడైన కట్టుబడినటులో?

ముంతా—ఏమియులేదు—ఎంతెంత ద్రోహులు రాజ్యమునందు బయలుదేరినారు!

రోష—ఇంకెందరు బయలుదేరుదురో! ఏమిచేయుదురో—చోరులు—హంతకులు విరివిగనున్నారు! మనము కొంచెము జాగరూకతగనుండవలెను;—అమ్మగారికందరియందును నమ్మకమెక్కువ—

ముంతా—బిడ్డా! మనము నమ్మియున్న వారెవ్వరును ద్రోహులుగారు—

రోష—పర్యవసానము తేలునంతవరకు మనమటులే యనుకొనుచుందుము; నాయనగారు కొన్న మణిహారమును జాగ్రత్తగ నుంచినారుగదా!

ముంతా—జాగ్రత్తగనేయున్నది—

(అష్మాక్—ప్ర॥)

ముంతా—అష్మాక్!—ఇటురమ్మా—నీశరీరమున క్షేమముగ నున్నదిగదా!

అష్మా—అమ్మా! మీదయచేత..............రోషనారా బేగం—సలాం—

రోష—ఈమెకీనడుమ పాపము చాల జబ్బుచేసినది!

ముంతా—అష్మాక్! ఏమైన పనియుండి వచ్చితివా?

అష్మా—నా వ్యాధికాలమున మీరు మొక్కుకొనిన విధమున వేయిమంది ఫకీరులకు అన్నదానము నేడే చేయవలయు ననుకొంటిమి.

ముంతా—నేను వచ్చుచున్నాను; నీవు నీపనిలోనుండుము.

అష్మా—(ప్రస్థానము)

రోష—అమ్మా! ఈయూర అష్మాక్ బీగమునకు బంధువు లెవ్వరున్నారు?

ముంతా—దానికెవ్వరున్నారు? మనమే బంధువులము—

రోష—కాదు సుడీ! మీకెఱుక లేదేమో—

ముంతా—అటులనుచుంటివేమి?

[" ఇప్పటికీ శరప్రయోగము చాలు!,,

రోష—అమ్మాజీ బీబీ అప్పుడప్పుడు—మోతీబజారునకు వెళ్ళి వచ్చుచుండుననియు—అచ్చట నామెకెవ్వరో కలరనియు—అప్పుడప్పుడిచ్చటనుండి ధనముకూడ పంపుననియు వింటిని; దిక్కు లేనిది గావున మీరే యిచ్చి పంపుచున్న వారని—

ముంతా—ఏమి యీ చిత్రకథ! అమ్మానుకెవ్వరైన బంధువులున్నచో—నాతోఁ జెప్పియుండదా! కాక—వారామె కీనడుమ జబ్బుచేసినప్పుడు వచ్చి చూచియుండరా?—

రోష—ఆమె యంతఃపురమున చరువుగ దిరుగుచున్నది—మీకు తెలియకుండ నామె వీధులు తిరుగుచున్నచో—మనము కొంచెము జాగ్రత్తగనే యుండుట మంచిది—

ముంతా—ఏమియిది! రోషన్—నీకెవ్వరు చెప్పిరో కాని ఇవి యన్నియు ఝూటామాటలు! ఆ చెప్పినవారెవ్వరినిఁజూచి అమ్మానుగా భావించినారో!............సరే! నాకు పని యున్నది. పోయెదను

(ప్రస్థానము)

రోష—(స్వగ) ఇప్పటికీ శరప్రయోగముచాలు—ఇదియే క్రమముగ గాయముచేయును – అమ్మగారి మనస్సును చికాకుపడఁ జేసితిని!—

(ప్రస్థానము)

## దృశ్యము—3.

ప్రదేశము:—షాజహాన్ సౌధమున షుజాగది

ప్రవేశము:—హుక్కా పీల్చు షుజా—మసావదు

సమయము—ఉదయము

షుజా—అరే మసావద్! నీవొకఁడవు నాదగ్గఱ నుంటచేత షరాబ్ దొరుకుచున్నది; కాని—నీవు జోబనాయింటికొక మారు వెళ్లివచ్చితివా?

మసా—సర్కార్! జోబనా మాటలకు లోఁబడునట్లులేదు—ఆమెకు రూపాయలు కావలెను. మీరు వచ్చి రూపాయ లిచ్చెదరని నేను దినదినము చెప్పుచున్నాను.

షుజా—ఒకవేళ నన్నీయింటిలోనుంచిరని నీవు పొరపాటున జోబనాతో చెప్పియుండవుగద!

మసా—అబ్బ! అంతపని చేయుదునా! తమకు రాచకార్యములు విశేషముగ నున్నవనియు—అందువలన, రాలేక పోయినారనియు చెప్పినాను—

షుజా—దొంగముండకొడుకవు — నాదగ్గఱ నీవిట్లనుచున్నావుగాని — జోబనాతోడ నేదియో చెప్పియే యుందువు.

మసా—అబ్బబ్బ! ఎంతమాట—నాపీక పోయిన, నటువంటి మాటలాడువాఁడనుగాను.

షుజా—సరే—అటులయిన, జోబనాయింటికింకెవ్వరైనవచ్చుచున్నారేమో కనిపెట్టితివా?

॥రత్న హారమును కౌంగిలింపవలెను!॥]

మసా—దేవరవారుంచుకొన్న జోబనాయింటికింకొకడేగుండె పెట్టుకొని రాగలండు? అది యేగుండె బెట్టుకొని రానిచ్చును?

షుజా—అట్లనుటకు వీలులేదు; భోగముముండ — దానిని నమ్ముటకు వీలులేదు.

మసా—సర్కార్! జోబనా అటువంటి మనిషికాదు; ప్రతి దినము మీ మాట తన్నుచుచునేయుండును.

షుజా—చక్రవర్తి నన్ను బంగాళమునకు రేపు పంపెద నన్నాడట! ఈరాత్రి వదలినచో—జోబనాను సంతోష పెట్టి ప్రయాణము చేయుదును.

మసా—ఔను మహారాజ్—అది మంచిమాట—జోబనారాణీ మీతో వుండి తీరవలెను.

షుజా—దిక్కుమాలిన చక్రవర్తి నన్ను వదలవలెనుగదా!

—(రోషనారా ప్ర॥)—

రోష—సోదరా!—షుజా!—

షుజా—ఏమిది! రోషనారా!—సోదరీ! రమ్ము కూర్చుండుము

రోష—ఏమిటి? ఆలోచించుచున్నావు!

షుజా—ఏమున్నది? ఈచెర యెప్పుడు వదలునాయని ఆలో చించుచున్నాను.

రోష—రేపు నిన్ను బంగాళమునకుం బంపెదరంట కాదా ....................ఎవండువీండు—

షుజా—నానౌఖర్—మసావన్

రోష—మసావన్! కొంచెమునీవు బయటనుండుము—

మసా—(ప్రస్థానము)—

రోష—తమ్ముఁడా! చక్రవర్తికి—రాశికి పక్షపాతమెక్కు-వయిపోయినది!—ఇఁక రాజకుమారులమని, రాజకుమారితలమని మనము గర్వింప నక్కఱలేదు—

షుజా—ఆఁ!—ఈ ముసలిముండకొడుకా మనల నవమానించునది; నేను నిజముగఁ దలంచుకొంటినా! అందఱు నాశనము కావలసినదే!

రోష—నిన్ను చక్రవర్తి యేల నిర్బంధము చేసినాఁడు!

షుజా—వేయిరూపాయలడిగితినని—

రోష—(స్వగ) వేయిరూపాయిల మిషచేత వీనికాశఁజూపి లోఁబరచుకొని నాకొక సాధనముగ నుంచుకొందును. (ప్రకా) ఇప్పటికి దొరికినవా!—

షుజా—లేదు—సోదరీ—లేదు;

రోష—పాపము నీవేదియో మిగుల నవసరమగుపని గల్గియడిగియుందువు.

షుజా—సోదరీ! మిగుల నవసరము — నీవా వేయిరూపాయల నిచ్చెదవా! రేపుసాయంత్రము నీకు—

రోష—వెఱ్ఱితమ్ముఁడా! ఏమియిది! మనమిరువుర మొకగర్భమునఁ బుట్టినవారము కామా! నీవీఋణము నాకు తీర్ప వలయునా! అటులనే యిచ్చెదను. తీసికొనుము.

షుజా—నీయనుగ్రహమెటులో యట్లుచేయుము-(స్వగ)అల్లా కటాక్షము!

రోష—తమ్ముఁడా! అటులేకాని—నీతో నొక రహస్యమగు పనియున్నది.

## దృశ్యము—౪.

ప్రదేశము—రోషనారా మందిరము-

ప్రవేశము—రోషనారా ఒంటరిగ.

సమయము—చీకటి పడినతరువాత.

రోష—(స్వగ) మసావదు ప్రజ్ఞచేత రత్నహారము నిర పాయముగ బయటఁబడినది...ఇఁక నాటకమారంభింప వలయును—గంట క్రిందటనే కబురంపినను, ధనసింగు రాక జాగుచేయున్న వాఁడేలనో—.....ఇది ధనసింగు చేయున్న యాలస్యమో—కాక, పిలువబోయిన మసావ దెక్కడనైన త్రాగి సుఖముగ నిద్రఁబోవుచున్నాఁడో—ధనసింగు నమ్మకమైన ముండాకొడుకే!—కాని బయటను గాని ధైర్యముగాని పిసికడు సున్న—ఐనను, దొంగ సాక్ష్యము చెప్పుటకు ధైర్యమొందునా? చూచెదను గదా!—అదుగో! మాటలోనే వచ్చినాఁడు ధనసింగు-

—(ధనసింగు ప్ర॥)—

ధన—మహారాజపుత్రీ! సలాం—

రోష—ధనసింగ్! నీతోనొక పనియుండి పిలువనంపి నాము—మసావద్—అవతల ఎవరు రాకుండ చూచుచుండుము.

మసా—(ప్రస్థానము).

ధన—తమయాజ్ఞయగునప్పుడు వ్యతిరేకము చెప్పుట కెవ్వరికి గుండెలున్నవి?

"ధనసింగ్ ఇదేమో చూచితివా?,,]

రోష—మా యందలి విశ్వాసమును, నీ తెలివి తేటలును చూపింపవలసిన సమయమిదియే—

ధన—దానుండను—

రోష—ఇది రహస్యవిషయము—బయల్పడినచో నీ వేమగుదువో తెలియునా?

ధన—పాదతుఖానును చూడబోవుదును.

రోష—(స్వగ) అరె! వీడిట్లనుచున్నాడేమి?—వెర్రివాడై యుండునా? ........... కాదు—ఇది కాకతాళీయముగ బలికిన పలుకు—(ప్రకా)ధనసింగ్!...ఇదేమో చూచితివా?

ధన—అబ్బ! కన్నులు మిరుమిట్లు గొల్పుచున్నది! రత్నముల దండ—

రోష—ముందు దీనిని నీదగ్గఱ దాచియుంచుము—జరుగవలసిన కథకిదియే మూలసూత్రము.

ధన—చిత్తము—(దాచుకొనును)

రోష—రాణిగారు పెంచుచున్న ఆస్మాన్ నెఱుగుదువుగదా?

ధన—వినకేమి—

రోష—దానికి భ్రూమధ్యమున గాయపు మచ్చయొకటియున్నది.—దానిని గురుతుగ నుంచుకొనుము—

ధన—చిత్తము—

రోష—ఆస్మాన్ హిందూ బాలికయనియు, నీవు దాని మేనమామవనియు, దీనిని చక్రవర్తినియింటనుండి యాస్మాన్ దొంగిలించి నీకిచ్చినదనియు—నిదివఱకు సయితమిట్లీ యనేకమారులు ధనముపంపుచుండెననియు నిస్సంశయ

ముగ—ప్రకృతిసిద్ధముగ — అనుమానముఁ దోపకుండగ చమత్కారముగ చెప్పవలెను. నీయిల్లుమోతీబజారులో నున్నట్లు చెప్పవలెను. హారముదొంగిలింపబడిన దినమెప్పుడో యెఱుఁగుదువా?

ధన—ఊరిలో చెప్పుకొనుచుండుట లేదా!

రోష—సరే! పొమ్ము—ఈపనిని నీవుచేసినచో—నీకువిశేష బహుమానము లభించును. నిన్ను రేపటిదినమున నీయూరి కొత్వాలు పట్టుకొని ముంతాజ్ మహల్ మందిరమునకు దెచ్చును. నేనును నచ్చటనుండెదను. నీవువచ్చునప్పటికి ఆష్మాన్ అందున్నచో—నీవామెకు చిరపరిచితుఁడవైనట్లు నటింపవలెను.

ధన—సరే! మిగతవిషయములను నేనూహించుకొని యెట్లెట్లువీలగునో యట్లట్లు చేసెదను. కాని నాకొక వేళ చక్రివర్తివలన నేదైన నపాయముకలిగినచో—

రోష—నిన్ను కారాగృహముననుంతురు—నేనునిన్ను మరునాడే విడిపించి పంపెదను—తెలిసినదా! నీవునేనిచ్చిన ధనముతో బంగాళమునకేగి బ్రతుకుము—ఈదినమే షుజా బంగాళమునకు వెళ్ళినాడు. అతఁడు నిన్నాదరించును.

ధన—భాగ్యము.

రోష—నీవింక వెళ్ళవచ్చును.

ధన—(ప్రస్థానము)

రోష—(తనలో) ఇఁక కొత్వాలునకు రత్నహారము ధనసింగువద్దనున్నజాడ చెప్పవలయును. (ప్రస్థానము)

దృశ్యము—౫.

ప్రదేశము—ముంతాజ్ మహల్ మందిరము.

ప్రవేశము ముంతాజ్, షాజహాన్, రోషనారా, ఆస్మాన్

సమయము—ఉదయము 10 గంటల వేళ.

షాజ—(కోపముతో) ఇది యంతయు నీ స్వయంకృతాపరాధము; అందఱను నీవు విశ్వసింతువు— నీదగ్గఱనున్న పెద్దదుర్గుణమేయది—

ముంతా—విశ్వసించి నేనెవ్వరికంతఃపురప్రవేశము గలిగించితిని—మహారాజా? అది కాలప్రాతికూల్యము?

షాజ—కాలము?—కాలమును నిందించుటకన్న బుద్ధిహీనత యింకొకటిలేదు. అనేకులు తమజ్ఞానహీనతచేఁగలుగు దుష్కార్యపరంపరలను కాలమున కంటగట్టి తృప్తులగుదురు—షాజహాన్ పరిపాలనమున హత్యలు—చౌర్యములు—రాజ్యమున నిరాఘాటముగ జరిగినవనిన—అందు నాయంతఃపురముననే-ఎంత తలవంపు-ముందుచరిత్రకారులు "షాజహాన్ విషయులఁ బటుఁడు—తనయంతఃపురమునుండి రత్నహారమును దొంగలెత్తుకొని పోయిననుకన్నుగానక—పందవలెనిదురబోవుచుండువాఁడు—ఇతనిరాజ్యమున నెందుజూచినను మనుష్యులొకరినొకరు నడువీధులలో పట్టపగలు నఱుకుకొనుచుండి"రని రచింతురా—కవులకు—చరిత్రకారులకు—ఏమున్నది? స్వల్పవిషయ మాధారముగఁ జేసికొని గ్రంథవిస్తరమునకై యున్నవిలేనివి పదికల్పించివ్రాతురు;

రాజువాని కెడమీయకుండ ప్రవర్తింపవలయును—ఎంత జాగరూకతగనున్నను—నాకట్టినిందలు తప్పటలేదుగదా?

ముంతా—(స్వగ) హా—అల్లా—ఏమి యీ ప్రారబ్ధము!—చక్రవర్తిహృదయమునకు నిష్కారణముగ నాందోళనమును గలిగించితినిగదా!—ఎందులకు నాబ్రతుకు?

రోష—మనకు పోయినది రత్నహారముకాదు—రత్నసమానమగుకీర్తి.........................కొత్వాలేమైన పనిచేసియుండునేమో—

సేవ—సలాం—మహారాజా!

షాజ—ఏమిరాఅది?

సేవ—మహారాజా! మనకొత్వాలు పెడరెక్కలువిఱిచి కట్టబడిన యొకపురుషునితో వచ్చి ద్వారమున నున్నాఁడు—

రోష—ఇది రత్నహారవిషయమై యుండునా?

షాజ—ప్రవేశపెట్టుము—

సేవ—(ప్రస్థానము)

(కొత్వాలు—ధనసింగుతో ప్ర॥)

ధన—ఉండు—నేను దొంగతనముచేయలేదు (పెనగులాడును)

కొత్వా—గింజుకొనకు—నీసంగతియంతయు చక్రవర్తిగారితోఁ జెప్పకొందువుగాని యుండు,...............సలాం మహారాజ్—

షాజ—కొత్వాల్! సంగతియేమి?

కొత్వా—మనవిచేయుచున్నాను, మహారాజా! (రత్నహారము నడిసి యిచ్చును)

"ఆష్మాన్—నవువు—ధనసింగ్—నవువు?,,]

అందరు—హాహా! రత్నహారము!—రత్నహారము!—

రోష—(ధనసింగును చూచి ఆష్మాన్ వంకకు సౌజ్ఞచేయు చున్నది.)

ధన—నామేనగోడలా! నీవిక్కడనేయుంటివా! నామర్యాద దక్కించు. నాప్రాణములు రక్షించు (కౌగలింపఁబోవును)

ముంతా—ఛీ! తుచ్ఛుఁడా! దూరముగనుండు! ఎవరనుకొంటివి!

ధన—ఇది నామేనగోడలు—కోడలా!—చెప్పవేమి?

రోష—ఏమి యీ చిత్రము!

ఆష్మా—(భయముతో ముంతాజ్ ప్రక్కకు వచ్చుచున్నది.)

ముంతా—బిడ్డా! భయపడకు.

పాజ—వీఁడు దొంగవేషము వేయుచున్నాఁడు—అంతఃపురమునం దత్యాచారము చేయుచున్నాఁడు—గట్టిగఁబట్టుకొనుము. కొత్వాల్! వీని సంగతిచెప్పుము; మేము విచారించెదము—

కొత్వా—మహారాజా! వీఁడీరత్నహారము నొకవర్తకునివద్ద విక్రయింపఁబోవుచుండగాఁ బట్టుకొంటిమి—వీఁడు తాను దొంగనుగాననియు—తన మేనగోడలు తనకిచ్చినదనియుఁ జెప్పుచున్నాఁడు.

పాజ—వీని మేనగోడలెవరు?

కొత్వా—ఆష్మాన్ బేగమట—

ముంతా—ఛీ! మరలనదే ప్రేలాపన—

పాజ—దేవీ! ఉండు—సంగతి పూర్తిగ విచారింతము—ఏమి కాలెది?

ధన—మహారాజా! ఇది నా మేనగోడలు.

షాజ—నీవు హిందువుఁడవుగాదా!

ధన—అవును మహాప్రభూ!

షాజ—ఆస్మాన్ నీమేనగోడ లెట్లగును?

ధన—ఇదియు హిందువే!

ఘోష—చిత్రము!

ముంతా—ఖూటాకోర్—

ధన—మాయక్కయు బావయు చనిపోయినారు-వారి కుమార్తెయిది-నాకిచ్చి వివాహముకూడ చేయవలయుననుకొనిరి-కాని, యిప్పుడు మహారాణిగారు పెంచుకొనుచుండుటచేత ఆస్మాన్ బీబీ యైనది. ఐనను పూర్వబాంధవ్యము నిది మఱువక-అప్పుడప్పుడు మోతీ బజారులో నున్న మాయింటికి వచ్చుచు సహాయము చేయుచునే యున్నది. నన్ను వివాహముకూడ చేసికొందునని వాగ్దానము చేసి-నాలుగు దినముల క్రిందట-నాకీ రత్నహారముం దెచ్చి యిచ్చినది.

షాజ—దేవీ! ఇప్పుడు దీని కేమందువు?

ముంతా—మహారాజా! నాకిదియంతయు నగమ్యగోచరముగ. మహామాయగనున్నది — పక్షపాతమని మీరనుకొన్నను సరే! నామనస్సిది నమ్మలేకుండనున్నది—

ఘోష—ఇది మోసము, మాయ ఏమియును లేదు-రత్నహారము మాట నేను పుట్టినదిగాని-ఆస్మాన్ యిట్టిదని.

మోతీ బజారున కరిగివచ్చుచు—బంధువులకు ధన మిచ్చు
చుందుననని, నేనిదివఱకే వింటిని.

షాజ—మాతో నీవేల నిదివఱకు చెప్పలేదు.

రోష—అమ్మగారితోఁ జెప్పితిని; వారులక్ష్యము సేయరైరి.

షాజ—(కోపముతో) ముంతాజ్! ఏమి! నీవేమియు నెఱుగ
నట్లు నటించెదవేమి?—ఇదివఱకే రోషనారా నీతో చెప్పి
నదంటగాదా!—ఛీఛీ—అంతయుమోసము—ఎవరిని నమ్మ
టకు వీలులేదు. అంతఃపురము కుచ్చిళ్లలో తాఁచుపాములు-
కొత్వాల్! ఇక నీవిషయమున విశేషచర్చ యనవసరము-
వీరిద్దఱను నాసెలవగువఱకు చెరియొక కారాగృహమునఁ
బడవేయుము—ఇదే నాసెలవు—నామెదడీయల్లరివలన చెడి
పోయినది. నేను విశ్రమింపఁబోవలయు—(ప్రస్థానము.)

కొత్వా—నడవండి—ఆష్మాక్-బీగం—నడువు-ధనసింగ్ నడువు

ఆష్మా—(ముంతాజ్ కాళ్ళపైఁబడి) అమ్మా! నన్ను రక్షిం
పుము-నేనే పాపమెఱుఁగను. చిన్ననాటినుండియు నన్నుఁ
బెంచి పెద్దజేసితిరి! నామనస్సెఱింగినవారు ఇదియంతయు
నెవరిమాయయో కాని నాకేమియుఁ దెలియదు—

(ఏడ్చుచున్నది.)

రోష—(స్వగ) దారా కళ్యాణవైభవము—భావి భారత
చక్రవర్తిని-ఇప్పుడు తెలిసినదా! నీదుష్టగ్రహ మీరో
షనారయే—దానికి నీయధఃపతనమే శాంతి—

ముంతా—ఏమిల కేడ్చెదవు! నీనిజచరిత్ర మెట్టిదో నాకుఁ
దెలియదు—పెంచితిని; పెద్దదానింజేసితిని; నాతింకీ నీకెం

తనఉకు ప్రాప్తమున్నదో యంతవఱకు జరిగినది—నీకింక ప్రాప్తము లేదు. నేనేమిచేయుదును? నీమూలమున నేను నేను చక్రవర్తి కాగ్రహ పాత్రమనైతిని—నాగతియే నేను చూచుకొనుటకిదినాకు కష్టసమయము—నీగతి ఎవ్వఁడు చూడఁగలఁడు—నిన్ను కోడలిం జేసికొనవలయునను కొంటిని—అంతయు సర్వనాశనము—నేనునీకే సహాయముం జేయలేను. పొమ్మ; నీకర్మము నీది—...నేన్నైన పెద్దరోగమువచ్చి చచ్చిన బాగుండును— (ప్రస్థానము.)

రోష—అమ్మా! ఏందులకేడ్చెదవు! ఇదియెవరి మోసమో తెలియదుగాని కొన్నినాళ్ళనుండియు నిన్ను తరుచుగా మోతీబజారునందు చూచుచున్నట్లు పలువురు చెప్పుచు న్నారు—అదేమి చిత్రమో—ఈశ్వరునకుఁ దెలియవలయు—ఇప్పుడు తొందరయేమున్నది—చక్రవర్తి దారంభకోపము ప్రస్తుతము కారాగృహమునకుఁబొమ్మ; నేను నాశక్తి వంచనలేకుండ—చెప్పిచూచెదను.

అమ్మా—(ఏడ్చుచున్నది.)

ధన—తెలివితక్కువదానా! ఈచేతగాని దొంగతనముచేసి నన్నుఁగూడ చెఱలో వేయించుచుంటివిగదా! -

కొత్వా—కేకలువేయకు పదపద—

(రోషనారాతప్ప అందఱు ప్రస్థానము.)

రోష—(నవ్వుచు) వహవ! అనుకొనినట్లు చక్కగజరిగినది! ధనసింగు మిగుల చాకచక్యముం బ్రదర్శించినాఁడు. ఇక నిశ్చింతతో నేను నిద్రబోయెదను .(ప్రస్థానము.)

## దృశ్యము—౩.

ప్రదేశము—కారాగృహము.

ప్రవేశము—లోపల ఆష్మాన్ బయట దూరమున దారా—

సమయము—రాత్రి.

దారా—(స్వగ) అంతయు మోసము—విద్రోహము—ఇది రోషనారా తంత్రము - సంశయములేదు-నాయాష్మాన్ చెఱసాలలోనున్నది!-ఈ దారా జీవించియుండగా నాష్మాన్ కింతటి ఘోరవిపత్తు సంభవించునా? - సుకుమారశరీరయగు నాష్మాన్ కారాగారముననుండ నాకన్నులతో చూడవలసివచ్చినది! - ఛీ - చక్రవర్తికి వివేకము!-ఎచ్చట మోసముగలదో నిర్ణయింపలేని - రాజుల పరిపాలన ముండియేమి? మండియేమి? - అదిగో-కారాగృహము-అస్త్రమువచ్చువారి కోటకు కరవాలముండనేయున్నది. ఈ నిశాసమయమున, నాష్మాన్ నెటులయిన నీ పాపపు ఢిల్లీనగరమునుండి తప్పించెదఁగాక! - (కత్తిదీసి) ఇప్పుడు కారాగృహముఁజేసితిని. ఇచ్చట నెవ్వఁడో కావలికాయుచున్నాఁడు! వీనిని బెదరించెదఁగాక! హఠాత్తుగ వానిపైఁబడి కత్తి (జూపి) ఓరీ! ఆష్మాన్ బేగ మెక్కడ?

సేవ—(వణకుచు) యువరాజా! నన్ను రక్షింపుము -

దారా—నీ ప్రాణములకు భయములేదు - ఆష్మాన్ ఎక్కడ?

సేవ—ఇదే చెఱసాల -

దారా—తాళపుచెవి ఏది?

సేవ—మహాప్రభూ! నాజీవనము -

దారా—ఇచ్చెదవా! చచ్చెదవా!

సేవ—తమయాజ్ఞ - (ఇచ్చును.)

దారా—(తలుపుఁదెఱచి) ప్రియా! ఆస్మాన్!

ఆస్మా—(దుఃఖముతో కౌగలించుకొని) ప్రియా! -

దారా—ఏమి యీదుర్గతి?

ఆస్మా—నావలన దోషములేదు; ఇదియెట్లు సంఘటించినదో నేనెఱుఁగను మీపాదమాన -

దారా—సరే! ఇది సంభాషింపఁదగిన తరుణముకాదు. రహస్యముగ నిర్జనక దూరభూమియందుంచి వచ్చెదను మోసమునకు మోసమేసరి - రమ్ము - నాతో -

ఆస్మా—చిత్తము.

సేవ—మహాప్రభూ! నాజీవనము -

దారా—ఎవరది? సేవకుఁడా?.........ఇదిగో ఈహారమును గైకొమ్ము - ఢిల్లీపురమునుండిటివా చచ్చెదవు. ఏదూర దేశమైనఁబోయి బ్రతుకుము.

(అందఱు ప్రస్థానము)

## దృశ్యము—౭.

ప్రదేశము—ఢిల్లీపురవంవలి బయలు.

ప్రవేశము—ఉన్మాదిని—జహానారా.

సమయము—అర్థరాత్రి.

జహా—(వికారస్వరముతో) సాదత్ - సాదత్ - మేరాజాన్ - సాదత్ - ఈ యంధకారమున నిప్పుడు నాతో మాటలాడి యేమైపోయితివి? పిశాచములతోఁగలసి యాటలాడుచుంటివా! పిశాచములకు సంగీతములు నేర్పుచుంటివా! మేరాసాదత్ - నామాటవిను; ఇఁక పిశాచములకు, సంగీతము నేర్పకుము; ఆపిశాచినీ - రోషనారాకు నీవు సంగీతము నేర్పితివి - అదివలచి నీపైఁబడినది తుదకు పిశాచినీ - అదియే నిన్నుచంపినది - చంపినది - హాహా! శవస్పర్శము - రక్తప్రవాహము - కాలాబాగ్ - అంధకారము - భీభత్సము - దారుణహత్య - ఎవఁడు నాప్రాణనాథుని - నాసుందరమూర్తిని - నాగాయకశిఖామణిని కటారితో పొడిచి చంపినాఁడు - వానిని పొడుచుటకై నాకడకటారియున్నది. కాని బద్మాష్ - ఆహంతకుఁడు నాకంటఁబడుటలేదు - ఎన్నాళ్లు దాఁగగలఁడు - పిశాచములు - పిశాచములు - ఈ చెట్టుమీఁద రహస్యము లాడుకొనుచున్నవి! - అందు నా సాదత్ ఖానుండునా! - లేకేమి? అందేయున్నాఁడు - కొమ్మలచాటున తలదూర్చియుంచి, నాతో మాటలాడుచున్నాఁడు - నవ్వుచున్నాఁడు -

క్రిందికి రావా! - నన్ను ప్రేమతోఁజూడవా! ఇది వెనుకటి జహానారాకాదా! - తలవెంట్రుకలు - చిక్కైనవనియా! బట్టలు మానినవనియా! - మొగము మలినమైనదనియా! శరీరము శుష్కించినదనియా! - నాదరికి రావు! నాతో మాట లాడవు! - సాదత్ ఖాన్ - సుందర్ సాదత్ ఖాన్! ఇవియన్నియు నిటులున్నది నీకొఱకే - నీవు లభించితి వేని అన్నియు సరియగును - నేను నీవెనుకటి జహానారా నగుదును ......... ఏమనుచున్నావు! - నీవద్దనేర్చిన సంగీతము పాడవలయునా! పాడినఁగానిరావా? - రావా? - అటులయిన పాడుచున్నాను - వీణలేదు - ఇప్పటికి నా చేయియే వీణ - (వాయించుట నభినయించుచు)

बानपलास—त्रिश्रगति.

प्रेमबंध हातसे मिलावो पारवश्यहो ।
तुमेहमे संगमिलन प्यारदोस्तुदिलसे करनहो ॥
वेपभावदिलबदलन सुखप्रवासजानहो ।
चांदका निशामे जहाजपर प्रचार करनहो ॥

బీన్ పలాస్—త్రిశ్రగతి.

ప్రేమబంధ హాతసే మిలావో పారవశ్యహో
తుమెహమె సంగమిలన ప్యారదోస్తుదిల్ సే కరనహో
వేషభావ దిల్ బదల్న సుఖప్రవాస జానహో
చాంద్ కా నిశామె జహాజ్ పర్ ప్రచార కరనహో॥

రావేమి? రావేమి?—ప్రియా—ప్రియా — చెట్టుమీదినుండి క్రిందికి బరువెత్తి యీచీకటిలో నెక్కడికిఁబోయితివి?

"సాదత్ ... చంపితివి రమ్మా!,,]

(ఏడ్చుచు) నీయందాశ పెట్టుకొనియున్న నన్ను
పాటలు పాడిపాడి చెట్టుక్రింద గనిపెట్టుకొనియున్న
దీనురాలినిం జేసి మోసపుచ్చి—పాఱిపోయితివా?—న
దిగతి? నేనెవ్వరికొఱకు పాటలు పాడుదును? ఎవరిని
మాలుకొందును? ఎవరిని ప్రార్థింతును—(క్రిందబడి
లుచు) నాశరీరమున మంటలు మండుచున్నవి—
తాపముగనున్నది—ఘోరసర్పములు నాచుట్టునుప్రా
విషజ్వాలలం గ్రక్కుచున్నవి. అగ్నిహోత్ర మాకా
నుండి వర్షముగ నాపైం గురియుచున్నది! సముద్ర
వెల్లువయై నన్ను ముంచివేయుచున్నది—నాకన్నులు
పోవుచున్నవి—(జుట్టు పీకుకొనుచు)—ఇవియన్నియు
దుఃఖమునకుం గారణములే — పాపీభగవాన్—నాకీసు
దీర్ఘకేశములను—మనోజ్ఞ ముఖమండలము నేలయిచ్చి
ప్రాణముపోదా?—పోదు—దుఃఖభాజనమగు ప్రాణమ
ఉండియేమి? పోయినయేమి?—......(నిదానముగం జూ
చు లేచి పకపకనవ్వి) హాహాహాహాహాహాహాహా! నాసాదత్! నా
దత్! నాకొఱకువచ్చితివా! నిన్నుకృపారహితుండనుకొ
టిని—కాని కావు—నీవు పరిపూర్ణదయాస్వరూపుండవు—ప్రేమ
మూర్తివి—అర్ధరాత్రమున, ఢిల్లీ ఆగ్రాలకు నడుమ
చీకటితోటలోన నాకైయల్లాడుచున్నావు!—రమ్ము—నన్ను
కౌగలింపరమ్ము......ఆ! ఆ! ఎవరది?—ఎవరది?—అంధకా
౬౬ రమున నాప్రక్కనుండి పరువెత్తుచున్నారు? ఆ! ఆ! మరా-
...! నా ప్రాణేశ్వరుని చంపుచుంటివా! ఘోరర...

సముద్రము—శవదర్శనము—భయంకరాకారము—సాదత్
సాదత్—

(మూర్ఛిల్లును)

(ధనసింగు భయముతో ప్ర॥)

ధన—(అటునిటు భీతితోఁజూచుచు)ధనమునకులోఁబడి నిష్కా
రణముగ నామహానుపై నసృతములాడితిని. ఆపాపమునకు
నాకేఫలముకలుగనున్నదో—కారాగృహమునుండి రోష
నారా నన్ను విడిపించి యీయర్ధరాత్రమున—బంగాళము
నకుఁ బారిపొమ్మని పంపినది!—కాని గూఢచారులు నా
వెంటఁబడినారు-ఎక్కడదాగుదును-ఇచ్చట చెట్లుదట్టముగ
నున్నవి. వీనిలో నీరాత్రి తలదాచుకొందునా!—(కాలి
కేదియోతగులుట నటించి) ఏమియిది! మెత్తని శరీరము!
శవమో! భూతమో—పరమేశ్వరా నాకేదిగతి—

జహా—(లేచి) దురాత్మా! దొరికితివి!-నాప్రాణేశ్వరునిచంపి
నన్నేడిపించి—పారిపోవుచుంటివా! చావు దుర్మార్గుఁడా—
హంతకుఁడా—చావు— (పొడుచుచున్నది)

ధన—పరమేశ్వరా!—(నేలపైఁబడుచున్నాఁడు)

జహా—సాదత్! సాదత్! చంపితిని—నిన్ను చంపినహంత
కునిఁ జంపితిని—ఇఁకరమ్ము—ఇఁకరమ్ము—

(తెఱలో)

ఆప్రక్కన కేకలు వినఁబడుచున్నవి—కారాగృహమునుండి
పారిపోయిన ధనసింగక్కడనేయుండును. పట్టుకొనుఁడు
పట్టుకొనుఁడు—

"సాదతో...చంపితిని—రమ్ము?"]

జహా—పిశాచములు—రాక్షసులు—భూతములు—ప్రతీకారము ప్రతీకారము—దారుణ ప్రతిహింస—

(కేకలువేయుచు—ప్రస్థానము)

(గూఢచారులు ప్ర॥)

ప్రథ—ఇచ్చటనే కేకలు వినఁబడినవి—

ద్వితీ—అవంక నెవ్వరో పరువెత్తుచున్నారు—

తృతీ—అటుగాదు. ఇక్కడ మూల్గు వినఁబడుచున్నది.

చతు—(దీపముతోఁజూచి) అరే! ధనసింగు నెవ్వరోచంపి పారిపోవుచున్నారు—

ధన—(కొట్టుకొనుచు) పరమేశ్వరా—నాప్రాణములు పోవుచున్నవి—కటారితో పొడువఁబడితిని — అన్యాయముగ—ఆష్మాన్‌పై నబద్ధపుసాక్ష్యమిచ్చిన పాపఫలము—నిర్దోషయగు నాష్మాన్—హా! హా! రోషనారా రత్నహారము—దొంగతనముచేయించి—అబ్బా — ప్రాణములుపోకున్నవి—రోషనారా బోధవిని చెడితిని—హా—హా—

(చచ్చును)

(అందఱును ఆశ్చర్యముతో చూచుచుందురు)

(తెరవ్రాలును)

చతుర్థాంకము.

# తాజ్ మహల్.

## పంచమాఙ్కమ్.

### దృశ్యము—౧.

ప్రదేశము—ముంతాజ్ మందిరము.

ప్రవేశము—ముంతాజ్-షాజహాన్-వైద్యులు-ఖాజీ-పరివారము

సమయము:—సాయంకాలము.

షాజ—(విచారముతో) భిషఙ్మణీ! — వ్యాధి నిర్ణయమును చేయఁగలిగితిరా?

వైద్య—మహారాజా! ఇది మనోవ్యాధి

షాజ—ఏమి? మనోవ్యాధియా—

వైద్య—ఔను. ముంతాజ్ బేగం తమయందు బద్ధానురాగముగల పతివ్రత! మీరు చెప్పిన విషయములనుఁ బట్టిచూడ — రత్నహారవిషయమైన కల్లోలమున తమ కామెపై—నాగ్రహముకలిగినప్పుడామెమనస్సువిచారధారమునఁ గ్రుంగిపోయియుండును. తరువాత ప్రేమతోఁ బెంచుకొనుచున్న ఆష్మాన్‌బీబి కన్యాయముగ శిక్షగలుగుటయు—నామెకారాగృహమునఁగూడ లేకుండఁబోవుటయు, నిప్పటికి చచ్చినదో బ్రదికియున్నదోయను జాడ సహితము తెలియకుండుటయు కుమార్తెయగు జహనారాబేగం — ఉన్మాదినియగుటయు మరికొన్ని విషయము

ములతోఁగలసి ఈమెకు మనోవ్యాధిని ఘటింపఁజేసియుం డునని తోచుచున్నది. ఇప్పటికనేక దినములైనది — నివారణోపాయము బహుకఠినము.

షాజ—(విచారముతో) ఔను! అష్మాన్ బీబీ కన్యాయము జరిగినది! ధనసింగు దొంగ — వానిసంగతి తెలిసికొనలేక పోయితిని— నాకాత్మీయులే శత్రువులైనారు. కన్న కడుపే యగ్నిహోత్రమైనది. ఎవరితో జెప్పుకొందును- ధనసింగు చచ్చునప్పుడు సంగతియంతయు బహిరంగమైనదని గూఢచారులు చెప్పినారు-

వైద్య—అవశ్యమను భోక్తవ్యం కృతం కర్మశుభాశుభం.

ముంతా—(నిద్దురలో) బేటీఅష్మాన్—బేటీఅష్మాన్—

వైద్య—అష్మాన్ అని కలువరించుచున్నది. అష్మానును చూచినచో నీమెస్వస్థపడునని తోచుచున్నది.

షాజ—అష్మాన్ కొఱకు బహుప్రదేశములు వెదికించితిని. జీవించియున్నచో— నాకుగబురు తెలిసియేయుండును ఆమె యవమానమును భరింపలేక—యాత్మహత్య చేసికొనినదని నానమ్మకము......ముంతాజు కాష్మానుపైననే విశేషము బెంగ—

ముంతా—(కన్నులు తెరచి దద్దరిల్లి) నేనిక్కడనేయున్నానా?

షాజ—ప్రియా! అట్లుదద్దరిల్లెదవేమి? నీవిక్కడనేయున్నావు.

ముంతా— ఒకగడియ క్రిందట నేనాష్మాన్ దగ్గఱనున్నాను.

షాజ—అది స్వప్నమైయుండును.

ముంతా—నాకంతయు స్వప్నముగనేయున్నది.

షాజ—క్రొంచెమౌషధమును సేవించెదవా?

ముంతా—అబ్బ! మీరౌషధములకై చాల శ్రమచేయుచున్నారు. కాని-ఇది యౌషధములకు లొంగురోగముగాదు నాకౌషధ మల్లా యీయువ లెను—ఈవైద్యులచేత నేమగును!—చూడండి; మీరుపంపిన యౌషధములాశయ్యక్రిందనున్నవి—నాకుమందు లెందుకు? (కంటనీరు పెట్టుకొని) మహారాజా!—నేనిక బ్రతుకను—

షాజ—(కన్నీరునించి) ప్యారీ!—ఏద్వకుము. నీవిట్లుముఖము పెట్టబట్టక—ఔషధ సేవచేసినచో మరల యథాస్థితికి వచ్చెదవు—

ముంతా—మీరుమందులు పంపెదరు—కాని నాయామ్మాను నాకుపంపఁగలరా? నేనామ్మాకు ద్రోహముచేసితిని! పెంచిపెంచి తుదకు దాని గొంతుకోసితిని.

షాజ—నీవుగాదు—ఆపని యాగ్రహమున నాలోచనలేక—నేనుచేసితిని ప్రియా! నన్ను క్షమింపవా?

ముంతా—మీరామాట లాడవద్దు—ఎవరేమిచేసిరి! కాల వైపరీత్యము'......ఆర్యపుత్రా! మీరునన్ను గాఢముగ ప్రేమించుచున్నారా?

షాజ—నేను నిన్నుదప్ప—నీ భూమిపై నికే ప్రాణినైన ప్రేమించుచున్నానా?

ముంతా—ప్రభూ?—మీ ప్రేమ ప్రాబల్యమును నేనెఱుఁగుదును నేను మరణించినను—

షాజ—అబ్బ! ఇప్పుడెందుల కామాట!

ముంతా—ఎప్పటికైన నాడవలసినదే కదా!.........మీరు నా ప్రేమ స్మృతి కొఱకై మఱియొక భార్యను వివాహ మాడకుందురని ప్రార్థించుచున్నాను.

షాజ—మనస్ఫూర్తిగ నీకోరికఁ దీర్చెదనని వాగ్దత్తముచే యుచున్నాను— నీవంటి జాతిరత్నము జారిపోవుచున్న ప్పుడు కల్లరాళ్లతో నాకేమిపని?—(దుఃఖించును.)

ముంతా—మీరు దుఃఖింపవలదు—నాకోరికవలన మీసౌ ఖ్యమున కంతరాయమగునేమో యని—

షాజ—ఇంకను, నాకు సౌఖ్యము కావలయునా? నలువురు నాయంత కొడుకులున్నారు. ఇద్దఱు కుమార్తెలున్నారు: కాలమూ గడిచిపోయినది;—కేశములు పూర్ణపలితము లైనవి. భోగమూయనుభవించితిని—(దుఃఖముతో) నీవంటి, గృహలక్ష్మి గడచిపోవుచున్నది. నాకింకేమి సౌఖ్యము?

ముంతా—మహాప్రభూ—మీ సేవాభాగ్యమే — నాకా నంద మనుకొంటిని—మీకుదప్ప నాకన్యముగ దైవ ముగలఁడని నేనెన్నడునుఁ దలంపలేదు. నమాజుకాల ములందు సైతము మీరూపమునేధ్యానించితిని; మీనా మమునే జపించితిని అల్లా నాకుముందెన్ని జన్మములను గల్గించిన నన్నిటియందును మీరేనాకు ప్రాణేశ్వరులు కావలయునని యీశ్వరుని వేడుకొనుచున్నాను........ నాథా!—నేను—కించిజ్ఞురాలను నంచిచెడ్డల నెఱుగనుఁ— సదా మీసన్నిధి నుండఁగోరి మీప్రేమ నభిలషించితి నేగాని—నావలన — నావలన — (ఆయాసముతో)

మీకుగలిగిన కష్టములను విచారింపలేదు ప్రభూ! ఈ దీనురాలు మీయం దాచరించిన యపరాధ శతములను క్షమింతురని పలుకుదురేని నాయాత్మ యానంద ముతో నీభౌతిక దేహమును—విడిచిపోవును. (ఆయాస పడుచున్నది.)

షాజ—దేవీ! నీకాయాస మధికమగుచున్నది. నీవుమాట లాడకుము— కొంచెము విశ్రాంతిదీర్చుకొనుము నీవుచే సిననేరము లేమియున్నవి. ఆష్మాన్ విషయమున బెంగగలి గించి నీకేనేను తీరనిద్రోహముచేసి యిప్పుడు నీమరణ మునకుఁగూడ కారణమైతిని.

ముంతా—ఆమాట – మీరు—మీరనుకొనవద్దు అంతయు పరమేశ్వర సంకల్పము—

షాజ—నీ వాయాసపడబోకు;

ముంతా—(కన్నులు మాయును).

షాజ—భిషజ్మణీ?

వైద్య—మహాప్రభూ!

షాజ—పదిదినములనుండియు నింత తెలివితో మాటాడి యెఱుఁ గదు. నేడింత తీవ్రముగ మాటలాడుచున్న దేమి?

వైద్య—మహాప్రభూ! తమరెఱుఁగనిదేమున్నది—నిర్వాణా సన్నమగు దీపము – తైలాభావమైపోయినది. బహుశః నేటిరాత్రి తెల్లవాఱునట్లు తోఁచదు.

షాజ—అంతేనా?—అంతేనా?—అంతకన్న నాశలేదా!

వైద్య—ఊరడిల్లవలయును.

షాజ—వైద్య మహాశయా! — కొడుకులు నామాటవినుట లేదు. కుమార్తెలస్థితి చూచుచుంటివిగాదా! నాసుఖము గోరినదొక్క ముంతాజ్ మాత్రమే! ఇంతచక్రవర్తి నగునాకు విశాలమగు నీప్రపంచమున సుఖమునకు స్థలము లేదు. ముంతాజ్ మహల్ గడచిపోయిన మరునాడు— నాకీమందిరము శ్మశానముగా కేమున్నది! నన్నుద్ధరించు వారెవ్వరు? ఎవ్వనిని నమ్ముటకు లేదు-ఆకుదాని మొదలు-మగవానివఱకు—రాజ్యకాంక్ష బలిసిపోయినది; నాప్రాణములుకూడ ముంతాజ్‌తోడనే పోయిన బాగుండును. (దుఃఖించును.)

వైద్య—మహాప్రభూ! శాంతి నందవలయును — మీరు ప్రాజ్ఞులు—మీ రెఱుఁగని దేమున్నది?

షాజ—ముంతాజ్ మరల కన్నులు తెఱచినది!

ముంతా—ప్రభూ! ఈదాసికేమి తరణోపాయము!—మీ పాదములను తుదసారి నాకన్నుల కద్దుకొందును — ఒకమారిటు తెండు — నాజన్మమున కిదియే కృతార్థత—

షాజ—అయ్యో! ఇదియేమి? ముంతాజ్ — ముంతాజ్—

(శోకించును)

ఖాజీ—మహాప్రభూ! ఇస్లామె కోఁకలనన్నిటిని దీర్చుటయే మీకర్తవ్య కార్యము.

ముంతా—ఎవరు? ఖాజీసాహెబ్! తమరిచ్చటనేయున్నారా? సమయమునకు వెదుకుకొన నక్కఱ లేకుండ......

ఐనది — వేళయైనది. ఇక నొక్క గడియ—......నా హా!
మీ పాదములు—

షాజ—(దుఃఖముతో) ప్యారీ! నన్నేమి చేసి పోవుచుంటివి?
(పాదములు దగ్గఱగనుంచును)

ముంతా—(కన్నులకద్దుకొని) మహాప్రభూ! కృతార్థురాల
నైతిని ఈనాటకమునందలి యీకరుణరస రంగమునందు
పరమేశ్వరుడు తాండవమాడుచున్నాడు! ఆతడేమీకును
నాకునుంగూడ—తరణోపాయము చెప్పవలెను మీ పాద
రజోలేశముచే నాజన్మమునందలి సహస్ర సహస్ర దోష
ములు పటాపంచలైపోయినవి......ఇక నాకేమి కోరిక
యున్నది! — మహాప్రభూ — మఱిదితిని — నాదొకతుది
ప్రార్థనము.

షాజ—నాజీవన సర్వస్వమా! సెలవిమ్ము.

ముంతా—నాయనంతరమున—

షాజ—(దుఃఖించుచు)హా! ఎట్టిమాటలువిని బ్రదికియున్నాను.

ముంతా—దుఃఖింపకుండు — మనుష్యులు మరణములేకుండ
శాశ్వతముగ నీ భూమి నంటిపెట్టుకొని యుందురా? ఈ
వేళ—రేపు—అంతే—ఆమాత్రపు భేదముతో నందఱును
నడువవలసినదే!..................నామాటలను పూర్ణముగ
వినుండు—మీరనేక ప్రాసాదములను—నిర్మించియున్నారు—
మోతీమసీద్—జుమ్మా మసీదుల నత్యంతసుందరముగం
గట్టించితిరి! నాయనంతరమున—నాజ్ఞాపక చిహ్నముగ—

"నాగోరీపై...మహల్ నిర్మింపుడు!,,]

నా గోరీపై నొక మహల్ నిర్మింపవలయునని కోరుచున్నాను.

షాజ—దీనిని నేనిదివఱకే సంకల్పించుకున్నాను.

ముంతా—నామనస్సిప్పటికి చల్లఁబడినది—నాథా! స్థితిగతులను విచారించిచూడ, నా జీవితము లెంతో కాలము నిలుచునని నేననుకొనను—గంటలలో నున్నటులున్నది. నాకు బలహీనముగనున్నది. శ్వాస విశేషముగనున్నది. ఇఁక మాటాడలేను—

షాజ—(గద్గదస్వరము) నీచరమకాలమున — నీవెవ్వరినైన చూడఁ గోరుదువా?

ముంతా—ఇంక—నాకెవ్వరున్నారు!—ఉండదగిన మీ ముఖకమలమును సందర్శించుచునేయున్నాను. ఇంతటితో నా కానందము చాలును.

షాజ—సంతానమెవ్వరైన—

ముంతా—హా!హా!—సంతానమూలముననే, నాకీగతికలిగినది. పాపిష్ఠిసంతానము! నాకేమియు వలదు — ఆ పాపాత్ముల మొగము చూడను..................నాథా!అవల పూర్ణచంద్రమండలము నీలాకాశమధ్యమున ద్యోతమానముగ నున్నది. చల్లగాలి వచ్చుచుండును. చివరగడియలలో నానందముగనుందును. నాశయ్య నావల వేయింపుడు—

షాజ—పరివారమెక్కడ?—

(తెర వ్రాలును)

దృశ్యము—౨.

ప్రదేశము—తాజ్ మహల్ మందిరము

ప్రవేశము—ఖాజీ—షాజహాను—పరివారము

సమయము—సాయంత్రము.

ఖాజీ—మహాప్రభూ! ముంతాజ్ మహల్ బేగము గోరీపై నిర్మింపఁబడిన యీ తాజ్ మహల్ మందిరమును వర్ణించుటను మనుష్యులుసాధ్యులు కారు. ఇందలియనర్ఘ్యమణులు ఈ చంద్రకాంతశిలలు—ఇందలి పనితనము—విచారింపని నె ప్రపంచచిత్రముల యందొకటిగఁ బరిగణింపఁబడనున్నది. అసంఖ్యకార్మికు లనేకసంవత్సరములు పనిచేసినారు—ఎన్నియో కోట్లధనము వ్యయమైనట్లు తోఁచుచున్నది. ముంతాజ్ మహల్ బేగం కీర్తి ప్రళయకాలము దనుక నిలుచునట్లు మీచేఁ జేయబడినది!—

షాజ—ఖాజీ మహారాజ్!—నా హృదయమునకు శాంతికల్గు మార్గము నెవ్వఁడునుపదేశింప లేకుండనున్నారు! హృదయ విచార మణఁగకున్నది—మీరిది మఱచిపోవలదు. నా యనంతరమున నా శరీరమును సైత మీ తాజ్ మహల్ నందే సమాధి చేయింపవలయును సుడీ!—

ఖాజీ—మహాప్రభూ! నాతోనేల చెప్పెదరు! మరణము చెప్పిరాదుగదా! ఎవరుముందో—చెప్పఁగలిగినవా రెవ్వరు?

షాజ—ముంతాజ్ మహాలు నాత్మకు శాంతికలుగునట్లు ప్రార్థనము చేయుడు—

ముంతాజ్ ఆత్మకు శాంతినిమ్ము.]

ఖాజీ—(కన్నులుమూసి నమాజ్ చేయును)

షాజ—(కన్నులుమూసి) ఓపరమేశ్వరా! దీనదయాళూ! నాయర్థాంగియగు ముంతాజ్ బేగము నాత్మకు శాంతిని ప్రసాదింపుము! అనిర్వచనీయ స్వర్గీయానందమున నాప్రేమమూర్తిని దేలింపుము— ఆమెను—దుర్నిరీక్ష్య దేదీప్యమాన భవ త్తేజోరాశియందువిలీనము చేసికొనుము— అంధకారమయమును — పాపభూయిష్టమును — నగు— నీప్రపంచమునుండి వచ్చునీదీనునిమొరలకు నీశ్రవణములనిమ్ము—స్వామీ! దయామయా! ముంతాజ్‌మహాలు నాత్మకు శాంతినిమ్ము—

— (ప్రార్థించుచుండగ తెరవ్రాలును)—

## దృశ్యము—౩.

ప్రదేశము—రాజవీధి.

ప్రవేశము—మసాలదు, మదార్.

సమయము—మధ్యాహ్నము.

మదా—మసావద్! ఈనడుమ దొంగసొమ్మునుదిని బాగుగ రంగుచేయుచున్నావు! —ఎక్కడగనంబడుటే లేదు—

మసా—అరే మదార్ — దొంగసొమ్ము దొంగసొమ్మనినన్నా క్షేపించుచున్నావు! నేనుదొంగతనము చేయగా చూచిన లంజకొడుకెవడురా?

మదా—సరిసరి—ఇదొకటా? పోనీలే—నీదొంగతనము సంగతి నాకెందుకు?—ఎక్కడికి తొందరగఁబోవుచున్నావు!

మసా—చక్రవర్తిగారికి జబ్బుగానున్నది — వైద్యులకొఱకు పోవుచున్నాను.

మదా—నిన్నింకను దివాణములో నుండనిచ్చినారా!

మసా—నీకెంత పొగరువట్టినదిరా

మదా—ఔను — ఈనడుమ కన్నములువేసిసంపాదించితిని— సరేగాని చక్రవర్తిగారికి విశేషముజబ్బుగానున్నదా?

మసా—ఔను లేచుటయే లేదు తానుగూడ మరణించినట్లయిన— తాజ్ మహలులోనే పెట్టవలయునన్న గొడవ తప్పయింకొకమాటలేదు.

మదా—అరెరే—పాపము! కుమారులుకూడ నెవ్వరునుదగ్గర లేరు—ఆయన యుపచారమున కెవ్వరున్నారు?

ఛీ! దానిపేరెత్తకు—]

మసా—జహానారా—దారా—

మదా—జహానారాకు పిచ్చియట గాదా?

మసా—ఈనడుమ కొంచెమున్నారని మాగినది బుద్ధిమాత్ర మింకను స్థిరములేదు. దుఃఖముతో తండ్రికి సేవచేయు చున్నది! ఇక్లిజన్మాంతము బ్రహ్మచారిణిగనుండునట!—

మదా—మరి దారామాట? అతఁడు తండ్రి కనుకూలముగ నున్నాఁడా?

మసా—అతఁడెప్పుడును తండ్రిపక్షము వాడే—రోషనారా మాత్రము—

మదా—ఛీ—ఛీ—దానిపేరెత్తకు—

మసా—మదాన్—నాకు వేళయైనది పోవలయును.

మదా—మంచిది — (ఇరువురు ప్రస్థానము)

## దృశ్యము—౪.

ప్రదేశము—రోషనారామందిరము.

ప్రవేశము—రోషనారా

సమయము—ఉదయము.

రోష—(స్వగ)దక్కనునందుండు నాసోదరుడు—ఔరంగజేబు గోలకొండను జయించినవార్త నాకమితానందదాయకముగనున్నది. ఆస్మానువిషయమున నేనుద్రోహము పల్పితిననియు, రత్నహారమును దొంగతనముచేయించితిననియు గొందఱు దుర్మార్గులు పురమున నందందు వాగుచున్నారట?—నా మొగమునెదుట నామాట ననగలవాడెవ్వడు? సోదరుడురాగనే సర్వప్రవాదములు నణగిపోగలవు—చక్రవర్తికి వ్యాధియెక్కువగనున్నది — ఈవార్తను నాసోదరుడగు నౌరంగజేబునకు వ్రాసెదను. స్వప్నము నిజమగుటకిదే మంచిసమయము — ఔరంగజేబుసంసారపరిత్యాగనటనము — ఖురాను పఠనము ఇప్పుడక్కఱకు వచ్చునట్లు చేసెదను—మూర్ఖుడగు మురాదును వశముచేసికొని యౌరంగజేబు తాను రాజ్యపరాఙ్ముఖుడయినట్లు నటించి — యాతని పక్షముననుండి — తత్సహాయమున మిగతవారి నోడించి తుదకు వానికంటదుమ్ముగొట్ట వచ్చును? ఇట్లే వ్రాసెదగాక!

(ప్రస్థానము)

## దృశ్యము ౪,

ప్రదేశము — ఢిల్లీపురబాహ్యప్రదేశము; మురాదుడేరా

ప్రవేశము — హుక్కాత్రాగుచు మురాదు — ఫకీరు వేషమున ఔరంగజేబు —

సమయము — ఉదయము

మురాదు — భాయీ! ఔరంగజేబ్! చక్రవర్తి చచ్చినమాట నిజమో — అబద్ధమో —

ఔరం — నాయనా! మురాద్! చక్రవర్తి శతవిధముల చచ్చియేయుండును; చావకున్నను మనమిందఱమిన్నివిధముల ప్రయత్నించుచున్నప్పుడు చచ్చినవారితో సమానుఁడే —

మురా — మనమార్గమున కాటంకము వచ్చువారికెవ్వరు?

ఔరం — బంగాళమునుండి యొకవేళ షుజా రావచ్చును. వచ్చిన వాని నొక్కక్షణమున నోడింపఁగలము — మనకును వీండ్రకునుఁగల తారతమ్యమేమనఁగా — మన యిద్దరి సేనలుకలిసి మిగత వారిసేనలకు రెండింతలుగనున్నవి; కనుక మనకు జయము సులభము — షుజా యోడిపోయిన తరువాత దారాను సయితమోడించి నీకు ఢిల్లీ పట్టముఁగట్టి నేను మక్కాకు పోఁదలంచితిని — దారా, షుజాక్రూరులు — చక్రవర్తి పక్షపాతముఁగలవాఁడు; నీకొక్కని కిందన్యాయము జఱుగుట గుర్తించి రోషనారా నన్నుఁ జూచి — నేనానాడే సన్యసించి మక్కాకుఁ బోదలంచిన

ప్పుడు నీవిషయమై విశేషించి చెప్పి—"సోదరా! నీకెట్లును రాజ్యకాంక్షలేదు. నీవు మక్కాకు పోదలంచినవాఁడవే కదా! మన మురాదు సహాయ రహితుఁడైయున్నాఁడు; వానికి సహాయమై నీవీ పుణ్యముఁ గట్టుకొంటివా—పిదప నీవు మక్కాకుఁ బోవచ్చు;" నని నొక్కి చెప్పెను. ఆమాటపైననే, నేను నీకొఱకింత తాపత్రయ పడుచున్నాను.

మురా—నీవు నాకొఱకు ఖురాను నయితము వదలిపెట్టితివి? నీవు మక్కాకనుగక, యుండేయున్నను, నిన్ను పెద్ద సుబేదారునుగాఁ జేసెదను.

ఔరం—(స్వగ) ఈపక్షి నన్ను సుబేదారుం జేయునఁట—ఏమి వీని జాగ్రదస్వప్నములు—

(మీర్ జుమ్లా ప్ర॥)

మీర్—మహాప్రభూ! దారా దగ్గఱనుండి రాయబారి వచ్చినాఁడు.

ఔరం—రమ్మనుము.

మీర్—(పోయి రాయబారితో ప్ర॥)

రాయ—ఔరంగజేబు సర్కారు వారికి సలాం — మురాద్ సర్కారువారికి సలాం—

ఔరం—నీవెక్కడనుండి వచ్చితివి?

రాయ—యువరాజగు దారా సర్కార్ దగ్గఱనుండి—

మురా—(స్వగ) దారా యువరాజయ్యెనఁట!—(ప్ర) ఓరి! చక్రవర్తిఁ దారాకు యువరాజ్య పట్టాభిషేకము చేసెనా?

రాయ—మహాప్రభూ! అట్టిది మాకేమి తెలియును.

"చక్రవర్తి చావలేదు?"]

మురా—తెలియనివాఁడవు యువరాజగు దారా సర్కారని కారుకూతలేల కూసితివి?

రాయ—భాగ్యము మరియొక మారనను.

ఔరం—నీ రాయబారమేమని?—

రాయ—ఇవి దారా సర్కారువారి పల్కులు—"మీకెంత తెలియఁజేసినను, చక్రవర్తి మరణించెనని భ్రమపను చున్నారు—చక్రవర్తి మరణింపలేదు—చక్రవర్తి జీవముతోనుండఁగా మనలో మన కంతఃకలహములు మంచివి కావు. నగరము ముట్టడింపమని తెలుపుచు—మీరు శాంతి పతాకము నెత్తించినంతనే—మేము పురద్వారములను తెఱపించెదము—

ఔరం—రాయబారీ! పురద్వారములు తాను తెఱపింపనక్కఱలేదనియు మాఫిరంగిగుండ్లు కవియే బ్రద్దలుగాక తప్పదనియు—మీదారాతో చెప్పుము; చక్రవర్తి చావలేదని మాకు దొంగ రాయబారములు పంపిన విశ్వసించుటకు—మురాదు సర్కారుగాని మరొకరుగారని చెప్పుము పొమ్ము

రాయ—మహాప్రభూ! చక్రవర్తిగారు మరణింపలేదు—ఇది నిజము—నేను కన్నులారఁజూచి వచ్చితిని.

ఔరం—తుచ్ఛుఁడా! రాయబారికి నీకధికప్రసంగమెందుకు? పో—నేను చెప్పుమన్న మాటలను, దారాతోఁజెప్పుము—సర్వబంధు సంహారముగావించి మురాదు సార్వభౌముఁడై మయురాసనము నధిష్ఠింపఁదలఁచియున్నాఁడని చెప్పుము.

రాయ—భాగ్యము (ప్రస్థానము)

ఔరం.—మీర్ జుమ్లా—

మీర్—(ప్ర॥) మహారాజా!

ఔరం—ముట్టడి యారంభింపవలసినదని చెప్పుము—

మీర్—చిత్తము—(ప్రస్థానము.)

ఔరం—(అటు నిటుం దిరుగుచు స్వగతము) చక్రవర్తి చావ లేదా?—చచ్చినాడనుకొని వచ్చితినో—చావ [illegible] వచ్చితినో—యీయాపద లెఱుంగుదురా?—

(తెరలో ఫిరంగులు)

ఔరం—ముట్టడి ప్రారంభమైనది.

(తెర వ్రాలును.)

పంచమాఙ్కమ్.

# తాజ్ మహల్.

## షష్ఠాఙ్కమ్.

### దృశ్యము — ౧.

ప్రదేశము — ఢిల్లీనగరము కోట బురుజుమీద —
ప్రవేశము — రోషనారా — ఖాజీ —
సమయము — ఉదయము.

రోష — (క్రిందికిఁ జూచుచు స్వగతము) అనుకొనినట్లు - ఔరంగజేబు కపట ఫకీరు మాయాజాలమునందు మందుఁడగు మురాదు చిక్కుకొనినాఁడు; నేటియుదయమున కప్పుడే బంగాళమునుండి షుజా తన సేనలతో వచ్చి యౌరంగజేబు నెదుర్కొనినాఁడు. సంకులసమరము జరుగుచునే యున్నది — ఆహా! ఏమియీ యుద్ధవైచిత్రి! తెగిపడుతలలు - తన్నుకొను మొండెములు — నలిగి చచ్చుప్రాణులు - పారెడు రక్తప్రవాహములు - మూగెడు గ్రద్దలు - ప్రేలెడు శతఘ్నులు తళతళలాడు శరకాంతులు — దిశలనంటెడు వీర గంభీర నిర్ఘోషము — భళీ — చూడ సొంపైయున్నది — భీభత్సమున నింత యానందముం జూడఁగలిగినది రోషనారా దృష్టియొకటియే — కానివో, నేయబల యీ భయంకరదృశ్యమునకుఁ గన్నులు తిరిగి యీకోట బురుజునుండి క్రిందబడి మరణింపకుందును! — భీభత్సము — భీభత్సము — ఔరంగజేబునకు జయమగుఁగాక! — ముఖాను మాయ్యాసము

ద్రమున మునింగి యచ్చటే తేలకుండ మరణించుగాక! షుజా పరాభూతుడగుగాక! ఇంక దారాచక్రవర్తులవిషయమెంత? త్రుటిమాత్రము—(ప్రకా) ఖాజీసాహెబు! ఏమి చేయుచున్నారు?

ఖాజీ—అమ్మా! ఈరక్తనదులకు నాకన్నులు చెదరుచున్నవి ఈ చచ్చినవారందఱు షైతానులయి నన్ను పట్టుకొందు రేమోయని భయపడుచున్నాను.

రోష—(నవ్వుచు) చచ్చువారు షైతానులై మనలను పట్టుకొందురా? మనమే షైతానులము; మనకన్న షైతాను లెవ్వరున్నారు పట్టుకొనుటకు?

ఖాజీ—షుజాసేన యింత స్వల్పముగనున్న దేమి?

రోష—షుజాసేన స్వల్పము కాదు—ఔరంగజేబు గోలకొండ జయించి యక్కడిసేనకూడ తెచ్చి మురాదుసేనతోఁగలిపి సందున నిది యపారముగనున్నది—ఈఢిల్లీపురము నిలువఁ గలదనుకొంటివా? ఈదినము షుజాతో యుద్ధము వచ్చుటచేత—కోటనిలిచినదిగాని, లేకున్న నీదినమే—యౌరంగజేబు మురాదులు పురప్రవేశముచేసియుందురు. అదిగాక—అంతసేన గనుకనే యుభయపక్షముల ధాకకు నిలిచినది

ఖాజీ—ఈ షుజా యుద్ధపుసందడిలో—కోటమీఁదివారు యథేచ్ఛగా—ఔరంగజేబు సేనపై ఫిరంగులు కాల్చుచున్నారు—కాని వారికి కోటపై దృష్టియేలేదు—

రోష—లేదుగనుకనే—మనమీబురుజుపై యథేచ్ఛగా నిలువఁబడి యుండఁగలిగినది!

షుజా నౌరంగజేబు జయించినాఁడు..."]

ఖాజీ—మీర్ జుమ్లా వచ్చి కలిసినాఁడా యేమి?
రోష—కలిసినాఁడు!....................కాని, దొంగముండ కొడుకు!
ఖాజీ—ఏమి?
రోష—వీనికొక ప్రభువని—విశ్వాసమని — లేదు; ఇచ్చట నున్నప్పుడు చక్రవర్తికి ద్రోహముచేసి గోలకొండకరిగి యచ్చట ద్రోహముచేసి యౌరంగజేబులో చేరినాఁడు. ఇచ్చటమాత్రము తిన్నగ నుండునన్న నమ్మకమేమి?
ఖాజీ—అట్లయిన వీనిపై నొక కన్నుంచవలసినదే—
రోష—ముఖ్యముగ—
ఖాజీ—అయ్యయ్యో! ఎవరిదా సేన?—గండిపడిన చెఱువు నీటి వలె తిరిగిచూడక పారిపోవుచున్నది—
రోష—(సంతోషముతో) భళి—భళి—మంచిపనిజరిగినది! షుజాసేనలోడి పారిపోవుచున్నవి. పారిపోవు సేనలపై మురాదు సైనికులుపడి—చెఱుకుకట్టలనట్లు నఱుకుచున్నారు.
ఖాజీ—ఎవఁడో యొక్క వీరుఁ డశ్వారూఢుఁడై వేరొకవంకకు బరువెత్తుచున్నాఁడు—షుజా కాఁడుగద!
రోష—సందేహమేమి?—అతఁడే—అతనివెంటఁ గొంత ఫౌజు పడి తఱుముచున్నది — రమ్మా ఇక మనమిచ్చట నుండ గూడదు—ముట్టడి ప్రారంభమగును—మనవంకకు ఫిరంగి గుండ్లు రాఁగలవు. ఇంతకు జరుగవలసినపని జరిగినది—షుజా నౌరంగజేబు జయించినాఁడు—

(ఇద్దఱు ప్రస్థానము)

## దృశ్యము — ౨.

ప్రదేశము — పంజాబునందలి యొకపల్లెలోనికుటీరము.

ప్రవేశము — ఆస్మాన్ బేగం.

సమయము — ఉదయ కాలము.

ఆస్మా — (స్వగతము) పరాభూతుడై పలాయితుఁడగు శత్రువువలె—కొండలనున్న హిమకణసముదాయము సూర్యరశ్మిచేఁ గరగి యెట్లు క్రిందికి ప్రవహించుచున్నది!— భాస్కరుఁడు స్వమయూఖములను రథాశ్వములకు తరుపత్రాంతరములందలి మంచునీటిచే దాహముదీర్చుచున్నాఁడు, ఎదిగిన పచ్చికబయళ్లమీఁద— పశుసంఘములు శాంతముగ తలలెత్తక మేయుచున్నవి. ఉదయకాలము మనోహరముగనున్నది కాని,........ప్రవాసబాధ దుర్భరముగనున్నది. పరమేశ్వరుఁడు నాజీవితము నింత దుఃఖభాజనముచేయనేల? ప్రాణేశ్వరుఁడగు దారా కారాగృహమునుండి తప్పించి నన్నీ కుటీరమున నుంచినాఁడు. త్వరలో వచ్చెదనని చనియు చాలకాలమైనది! ఎప్పుడువచ్చునో తెలియదు. ఈశూర వృద్ధుఁడయ్యు శూరుఁడగు నీ జమాదారు నన్ను రక్షించుచుండుటచే—నిరపాయముగ నుంటినిగాని—నాకిచ్చట దిక్కెవరున్నారు? అదిగోమాటలోనే జమాదారుబాబు వచ్చుచున్నాఁడు—

(శిక్కు జమాదారు ప్ర॥)

జమా— బిడ్డ! క్షేమమేకదా!

"అష్మ్రన్ కావా! పాపము"]

అస్మా—బాబూ! నీదయ పరిపూర్ణముగనుండ నాకన్నేను మేల కలుగును? షిస్తీవార్తలేమైనఁదెలిసినవా?

జమా—నీవు వినఁగూడని వార్తలు తెలియుచున్నవి!

అస్మా—ఏమి యీాపశ్చయము!—నాయనా! మన దారాకు క్షేమమేకద!

జమా—బిడ్డా! ఆందోళనపడకు. దారా క్షేమముగనున్నాడు—నిన్ను పెంచినతల్లి ముంతాజ్ నీవు నిర్దోషవనుతెలిసికొని నీవిరాహ బెంగచే కాలధర్మమునందినది!

అస్మా—హా! హా! జననీ! జననీ! — ముంతాజ్ మహల్! మమ్ములందరను విడిచి శాశ్వత సుఖజీవన మార్గమున బ్రవేశించిపోయితివా తల్లీ!—సంపూర్ణముగనన్ను దిక్కుమాలిన దానిం జేసితివా! ఏనాటికైన నీకు నాపైఁ గృప గలుగును; ఏనాటికైన నీపాదసేవ నాకు మరల లభించు ననునాశతోనున్న నాయాశాబీజమును నిర్మూలించితివా! ఈనిర్భాగ్యురాలిపైననే బెంగఁబెట్టుకొని మరణించితివా! తల్లీ! నిన్ను బ్రదికిఁన్నాళ్ళు కష్టముల పాలుచేసి— తుదకు నీచావునకును నేనే కారణమైతిరా! — జననీ—

(ఆక్రందించుచున్నది)

జమా—బిడ్డా! దుఃఖపడి మనము చేయునది యేమున్నది?

అస్మా—నాయనా! నన్ను పెంచినది—పెద్దజేసినది! నన్ను కాలుకిందఁ బెట్టనీయకుండ గారాబమునఁ జూచినది. తన కుమార్తెలకన్న నధికానురాగమున నన్ను బోషించినది. నన్నుఁదనయంత మహారాణిం జేయు నిష్కల్మష బుద్ధిని

సంకల్పించినది—అట్టి నాహితైషిణి—నాజనని మరణము నకు నేనెట్లు దుఃఖింపకుందును—

జమా—బిడ్డా! నాకావల పనియున్నది పోవలయు—ఈరెండు మాటలుగూడ వినుము.....ముంతాజ్‌గోరీపై షాజహాను బాదుషా మహాప్రఖ్యాతి నందయున్న తాజ్‌మహల్ మందిరమును కట్టించుచున్నాఁడు.....కాని చక్రవర్తి వ్యాధిగ్రస్తుఁడై యున్నాఁడనియు ఔరంగజేబు మురాదు లిద్దఱుంగలిసిఢిల్లీపై దాడి వెడలిరనియు సంకులసమరం బగుచున్నదనియుఁ దెలియవచ్చుచున్నది.

అష్మా—అమ్మయ్యో! అటులయిన యువరాజో—

జమా—యువరాజు ఢిల్లీనగరముననే యున్నాఁడని తోఁ చుచున్నది—

అష్మా—యుద్ధపర్యవసాన మెటులున్నదో—

జమా—ఇంకను తెలియలేదు. నేడు నేనొకముఖ్యకార్యమున నరుగవలసియున్నది. రేపు వచ్చి నీకు మరికొన్ని విష యముల నెఱిగింపఁగలను. నేటికి నీ ప్రాణరక్షణమునకై దగ్గఱ కైజారున్నదిగదా!

అష్మా—ఉన్నది.

జమా—హెచ్చరిక! — నేను పోయివచ్చెదను—(ప్రస్థానము)

అష్మా—(స్వగ — విచారముతో) నాతల్లి యీలోకమును విడిచిపోయినదా! అహాహా! ఎంతచల్లనితల్లి నీశ్వరుఁడెత్తు కొనిపోయినాడు. చక్రవర్తి స్వప్నము ఫలితమునకు వచ్చుచున్నది. రాజకుమారులన్యోన్యసంగ్రామోత్సా

హులైయున్నారు! ఇక నాహృదయేశ్వరుఁ డీకల్లోలమునఁ గోట విడిచి వచ్చుటెక్కడిది? రేపు జమాదారుబాబు వచ్చినంతనే సెలవుపుచ్చుకొని ఢిల్లీకి బోయెదను భావి మార్గమును భగవంతుఁడే చూపును.

(తత్తరముతో షుజా ప్ర॥)

షుజా—(ఆయాసపడుచు) అశ్వము మార్గముననే మరణించినది, ఆయాసముచేతనాకు మూర్ఛవచ్చువట్లున్నది. నేనింకపరువెత్తలేను. శత్రువులుసమీపించుచున్నారు... ఇదియేవరో కుటీరము! ప్రాణరక్షణమునకై యిందు ప్రవేశించెదను.

(లోపలకువచ్చును)

ఆష్మా—ఎవరుమీరు?

షుజా—అమ్మా — ప్రాణ భిక్షుఁడానను. రక్షింపుము— శత్రువులు తరుముకొని వచ్చుచున్నారు—

ఆష్మా—(స్వగ) ఎవరైననేమి?—అమ్మాయనిపిలిచి రక్షింపుమనిపలికినాఁడు—భిక్షుకుఁడు. ఇతనిసిరక్షించినదే పుణ్యము—(ప్రకా) నాయనా! ఆగదిలోనికిబొండు—నేనీద్వారమునసుందును ఎవ్వరిని రానీయను; ఎవరైనవచ్చినను నాదగ్గఱ కటారియున్నది. నేనుబ్రదికియున్నంతవఱకు మీకుహానిగలుగదు.

షుజా— (ప్రస్థానము)

ఆష్మా—శత్రువులప్పుడేవచ్చుచున్న యశ్వధ్వని వినఁబడుచున్నది! వీరిని మోసగించి యావలకుఁబంపవలెను.

(నలువు రాష్ట్రకభటులు ప్ర॥)

ప్రథ—ఏడి! ఎక్కడి కేగినాఁడు! ఇంద్రేమాయమైనాఁడు—

ద్వితీ—ఈయువతి కేమైనఁ దెలియునేమో

ప్రథ—అమ్మా! ఎవఁడైన నీ ప్రాంతమునకు బరువెత్తివచ్చుచుమీకుఁ గనఁబడినాఁడా?

ఆమ్మా—ఇప్పుడే ఈదారిం బోయినాఁడు—దొంగతనమేమైనఁ జేసినాఁడా!—

ప్రథ—దొంగతనము కాదు వాఁడుషుజా — మేమౌరంగజేబాశ్రీకులము!

ద్వితీ—పట్టు గెత్తుదము—రండు—ఆదారిం బోవుదము.

తృతీ—వాఁడీ కుటీరముననే దాగినాఁడేమో—

చతు—ముందీ కుటీరమే శోధింతము రండు—

ఆమ్మా—మీకెంత వెఱ్ఱివాండ్రు? వాఁడీపాటికే చాలదూరము పోయియుండును! ఇక్కడనేమి జాగు చేసెదరు పొండు! మురాదు ఔరంగజేబులకు జయమగుగాక—పొండు—పొండు—

ప్రథ—రండిరా! ఈమె మన పక్షపుదే—వాఁడిక్కడ నేలయుండును? అటువెళ్లినాడు—రండి— (అందఱు ప్రస్థా)

ఆమ్మా—ఈమందుల కండ్లలో కారముఁజల్లితిని తిరిగిరాకుండ వీరా మార్గముననే పోవుదురు గాక! — ఈతఁడు షుజా యఁట! పాపము మహారాజకుమారున కెంతగతిపట్టినది!—దైవము తిన్నగా చూచినచో నాహృదయేశ్వరుని తమ్ముఁడేకదా!

(షుజా ప్రి)—

షుజా—అమ్మా! వాండుప్రి చనినాయగదా!

ఆప్మా—ఇప్పటి కరిగిసారు—రాజకుమారా! మీరుశ్రీమ దీర్చుకొనుండు — నేనుమీకు భోజనము సిద్ధముచేసె దను.

షుజా—(స్వగ) ఎప్పుడో చూచిన మొగము! (ప్రికా॥) అమ్మా! మీపేరేమి?

ఆప్మా—నేనొక అభాగినిని—(ప్రిస్థానము)

షుజా—(స్మృతినభినయించి) ఆ! జ్ఞప్తికివచ్చినది! ఇదిఆప్మాక్ కాదా! పాపము! దీనికీగతి గలిగించిన దుష్టుడను నేనే కాదా! రత్నహారమును మసావదుచే దొంగిలింపజేసి రోషనారా ప్రోత్సాహమున, నేనీ యాప్మానునకు తీరని యపకారముచేసితిని; ఇది నాప్రాణములను రక్షించినది! ఆహా! దైవఘటనము! నేనేమిచేసిన దీనిఋణము తీరు ను?—పాపము! అమాయికురాలు—నేను తన కపకారము చేసిన క్రూరుడనని యెఱుంగదు!—......మరలనాకూరి రులు వెదుకుకొనుచు వచ్చెదరేమో — కనబడకుండ మరల నీమందిరముననే దూరెదను—

(ప్రిస్థానము)—

## దృశ్యము —౩.

ప్రదేశము—ఆదేశటీరము.

ప్రవేశము—చెరియొక శయ్యపై—ఆష్మాన్—షుజా—

సమయము:—అర్ధరాత్రి.

షుజా—(మంచముపైఁ గూర్చుండి) కరవాలము జాగ్రత్తప ఱచికొనకున్నను — ఈ షుజా శూరశిఖామణి — కైపున్నకే సారాసీసాను విడువకుండ వెంటఁదెచ్చుకొన్నాడు— మరి యాదగ నుండదని — పగలంతయు — నాష్మాన్ ఎదుట దీనిని విప్పుటకు సంశయించితిని. ప్రాణము గిలగిల కొట్టుకొనుచున్నది—ఇప్పుడాష్మాన్ నిద్రబోవుచున్నది. చల్లగా దీనిని ద్రావి నిద్రబోయెదను. (త్రాగుచున్నాఁడు) అబ్బ!—త్రాగునప్పుడేయసహ్యము — కంపు—లేకున్నచో—దీనివ్యాపక మడుగనలయునా? పాడుభగవంతుఁడు దీనిరుచిగ సృష్టింపఁడయ్యె — అప్పుడే కన్నుల కెగదట్టె కొంచెము కొంచెముగ తలకెక్కుచున్నది-చుట్ట దీనికిమంచి చుట్టము — (చుట్టగాల్చి)వా రెవా!—పదునాలుగు లోకములొక్కమారు కనఁబడుచున్నవి. వేయిరూపాయి లపహరించి జోబనా మాకు పూజ్యము చెప్పినది. భోగముముండ; దాసిని నమ్మఁగూడదని నేనెంత చెప్పినను మసానుడుగాడు కొంచెమయిన నమ్మినాఁడా? నామట్టుకు నే నొకరిని నమ్ము స్వభావముఁ గలవాడనుగాను. కాని నహును.త్రిము—తెలిసి తెలియని...... కైపుగానున్నది...

ఒకటే దోరశిలోనికి దింపినది. ఇప్పుడు కొంచెము థాడీ పట్టుకొన్నది (లేచి వెన్నెలలో నటునిటుం దిరుగుచు) ఈ సూరజ్—సూరజ్ కాదు-చందర్—ఈచందర్ నాశరీరము నకు గరమ్ చేయుచున్నాడు—ఈ గరంలోనే—హేహేహే హే—మాకు జోబనా బీగంకావలెను — మేమిప్పుడెక్క డనున్నాము? — నరకంలో — కాదు—స్వర్గంలో — అదీ కాదు—రత్నహారం దొంగిలించినందుకు ఖైదులో—అదీ కాదూ-మమ్మల్ని ఖైదుల్లో వేసేవాడెవడు?-హేహేహే- మేము జోబనా యింట్లోనేవున్నాము — జోబనాకు—కో షనారా దగ్గఱ పుచ్చుకున్న వేయిరూపాయీలు యిచ్చి వేసినాము — మేమందులో — షరాబ్ కైనా ఒక్కరూ పాయి మిగుల్చుకోలేదు ఆ రూపాయలను పూర్తిగ నప హరించి—జోబనా నిద్రబోవుచున్నది — (అష్మాన్ దగ్గ ఱకుబోయి లేపబోయి శంకించి) ఎవరిది? జోబనా.... కాదు......కకపోయిన నెవ్వరు?......ఎవరో మరియొక రు......ఆలోచనకు బుద్ధిచాలదు......కాదుజోబనా యిదే — ఇదేజోబనా......నా వేయిరూపాయిల జోబ నాయిదే......(మీదబడి) మేరా జోబనా! వేయిరూపా యిల కొక్కముద్దైననీయక నిద్రబోవుచున్నావా?

ఆష్మా—(త్రుళ్ళిపడి లేచి) ఓగీ! ఎవండవు నీవు?—నీవా! షుజా! ఏమి యీపని?

షుజా—-(కైపులో తూగుచు) మేరా జోబనా—ఒక్కముద్దు— (మీదం బడంబోవును)

అష్మా—(తప్పించుకొని, స్వగ) ఆహా! వీఁడు బాగుగ తాగి నాపైఁబడనున్నాఁడు. ఏమిగతి?-కానిమ్ము; అవసరమైనచో కటారి యుండనేయున్నది. (ప్ర॥) ఓరీ! ఒడలు తెలిసికొని చూఁడు—నేను అష్మానును—జోఁబానుగాను—తెలిసినదా!

షుజా—(తూఁగుచు) ఆష్మాన్—అష్మాన్—ఔను మేము బ్రతికి లేనప్పుడు మిమ్ముల్ని కౌఁగలించుకొన్నాము—ఇప్పుడుమీరు జోబనాబీబీఐపోయినారుమిమ్ముల్ని బలవంతముగా కౌఁగలించుకొంటాం-జోఁబనా! వేయిరూపాయల జోఁబనా!ఇటురా

అష్మా—(స్వగ) వీనికాయుష్కాలము సరిపోయినది! కనుక నే ప్రాణరక్షణముచేసిన నాపైఁబడ నుంకించుచున్నాఁడు— పరమేశ్వరా! తుదకు నాచేహత్య చేయించుచున్నావా?- ఈ పాపము నన్నేమి చేయునోకదా?

షుజా—మేరా—జోఁబనా—(పైఁబడును.)

అష్మా—ఛీ—పాపీ నన్ను వదలు—

షుజా—(గట్టిగఁ బట్టుకొనును.)

అష్మా—ఇంక నాయత్నములేదు—నీ యాయుష్యము పూర్తియైనది. చావు దురాత్ముఁడా! (గుండెలలోఁ పొడుచును.)

షుజా—హా—జోఁబనా—(నేలఁగూలును.)

అష్మా—హా! హా! ఈరక్తమయ ఘోరప్రదర్శనమున నా కన్నులు తిరుగుచున్నవి. ఈ హత్యారంగమున నేనిఁక నిలువలేను—నేనిక్కడనున్నచో—నన్ను హంతకురాలనని పౌరులు బాధింతురు—ఈ కటారి చేతిలోనుండఁగా నాకే భయమునులేదు. శీఘ్రకిఁ బోయెదను. (ప్రస్థానము.)

## దృశ్యము—౪.

ప్రదేశము—ఢిల్లీపుర రాజప్రాసాదము.

ప్రవేశము—దారా—సాదుల్లామంత్రి—పరివారము.

సమయము—ఉదయము.

దారా—సాదుల్లా! నేను ఢిల్లీపురము మనదికాదని తోచు చున్నది.

సాదు—యువరాజా! అట్లే. నాకును నధైర్యము గల్గుచున్నది!

దారా—చూచితివా నాకు తమ్ములైయుండి ఈదుర్మార్గులు చేతిలోనికి సేన యమరగనే యెంత ద్రోహమునకు పాల్పైరో!

సాదు—స్వామీ! ఇదియంతయు నౌరంగజేబు తంత్రము!

దారా—తాను విరాగియఁట! ఫకీరఁట—ఖురాను వదలఁడఁట ఈసామ్రాజ్యమును మురాదుకుఁ గట్టిపెట్టి తానుమక్కాకుఁ బోవునఁట!—

సాదు—పెద్దపులి జపము చేయుచున్నదనిన, నమ్మువారెవ్వరు?

దారా—మన సేనలగతి యేమైనదో, కొంచెమైనఁ దెలిసినదా?

సాదు—భటులు వార్తానివేదనము చేయుట కెడములేకుండ నున్నది. పైనుండి చూచుచున్నంతవఱకు కందకమున కావల మనముంచిన సేనయంతయు హతమైనది; శత్రువులువచ్చి—కవాట భేదమున కుపక్రమించినారు; ఉదయమునుండియు కవాటముకడనే దొమ్మి జఱుగుచున్నది.

దారా—భారము దైవముపైనిడి—మనవారు మిన్నకున్నటు లేనా?

సాదు—అన్నమాటే—గోడలపైనుండి మాత్రము క్రిందికి ఫిరంగులను వదలుచున్నారు—

దారా—సముద్రమున కాకిరెట్ట—

సాదు—ఒకగంట కాలములోపల బహుశః ద్వారములు స్వాధీనములగునేమో—

దారా—ద్వారము నేల ఛేదింపవలెను?—మరల బాగుచేసికొనుటకు కష్టపడవలయునుగదా!—మనమే సంధి కనుమతించి తలుపులు తీయించుట యుక్తమేమో యాలోచింపుము.

సాదు—మహారాజా! సంధికి తరుణము దాటిపోయినది. దుష్టుఁడగు నౌరంగజేబు తమపై సేదైన, నత్యాచారము సయితము సలుపునేమోయని భీతి కలుగుచున్నది.

(తెరలో కోలాహలము.)

దారా—సేవకా! అదేమో కనుగొని రా!

సేవ—(ప్రస్థా॥)

సాదు—సేనలు కోటలోఁ బ్రవేశించినవని తోచుచున్నది.

సేవ—(ప్రవే॥) మహాప్రభూ! ఔరంగజేబు—మురాదు—సేనలతో లోపలఁ బ్రవేశించినారు. ప్రళయము వచ్చినట్లు తోచుచున్నది—

దారా—సాదుల్లా—స్వామిల్లా—మనకిప్పు డేదియుపాయము:—

"నీవు...ఖైదీవైతివి,,]

సాదు—శౌర్యమునకు మనకిప్పుడేమి యాధారమున్నది. అందుచే నిగత పని చేయవలసియుండును.

సేవ—శత్రులువచ్చి రాజప్రాసాదముం బ్రవేశించినారు—మహాప్రభూ!—

(ఔరం—మురాదు—పరివారముతో ప్ర॥)

దారా—తమ్ముండా! మురాదు! మనలో మనకు యుద్ధమెందుకు? ఈ ప్రయత్నమేమి?

మురా—(వికటముగ నవ్వి) అన్నా! చుట్టరికమునకు సంధికి కాలము మీరిపోయినది—

దారా—తమ్ముండా! ఔరంగజేబు! తమ్ముండు మురా దిట్లనుచున్నాండేమి?

ఔరం—(కన్నులు చిట్లించి) అల్లా—పర్వార్ దిగార్—మేమీ పాప కార్యములను చూడలేము—(ప్రస్థానము.)

మురా—సేవకులారా! చూచెదరేమి?

దారా—మురాద్! ఏమి యీ దౌర్జన్యము—

సేవ—(పైఁబడి దారాను విఱచి కట్టుదురు.)

మురా—దౌర్జన్యములేదు—నీవు మాఖైదీవైతివి—ఓరీ! భటులారా! ముసలిరాజు వ్యాధితో నున్నట్లున్నాడు—వాని నామందిరముననే ఖైదు చేయుండు—

(అందఱు ప్రస్థానము.)

దృశ్యము—౫.

ప్రదేశము—షాజహాన్ వ్యాధిశయ్య.

ప్రవేశము—వ్యాధిచేఁ బరుండు షాజహాన్—పాదములకడజహా నారా—ద్వారమున జీడాయనుసీగ్రో—వైద్యుఁడు—

సమయము—ఉదయము—

షాజ—బేటీ! జహానారా!

జహా—జీ! జహాపనా!—

షాజ—నీవునిద్రాహారములుమాని—నాకొఱకు—సౌఖ్యముంబరిత్యజించి—ఏమిలాభము!—పోయిపండుకో—

జహా—జనకా! నేను సౌఖ్యమునకు తుది నమస్కారము చేసితిని; ఇప్పుడు నాకు దుఃఖముకంటె యానందము కనంబడుచున్నది. దుఃఖమే నేను—నేనే దుఃఖము—అమ్మ—నిర్మలజీవనమునకుఁ బోయినది. నేనెవ్వరియందు సౌఖ్యాశ యుంచితినో—యాదివ్యమూర్తి యంతర్థానమై పోయెను—అతనితోడ నేనాయాశ—నాయానందము—అంతర్హితములైపోయినవి. నాకీ యిహజీవితమున పూజనీయులగు మీసేవచేయుటకన్నఁ గావలసినదేమున్నది—ఆపుణ్యమూర్తి హత్యచేయఁబడిన యనంతరమున—నాకుగల్గిన మనశ్చాంచల్యముసయిత మీవైద్యమహాశయునిచేదీర్పఁబడినది—ఇకనిత్యబ్రహ్మచారిణిగ నుండఁదలచితిని, మీరుక్షేమముగనుండు రేని నాకదే యానందము—

షాజ—నాబిడ్డా! నన్నెంతగాఢముగఁ బ్రేమించితివి! నీకు—నీసౌఖ్యముకొఱకు ఏమియుఁజేయలేనివృద్ధుఁడనైతినిగదా నేను.

ఈ... నీగా)వాఁడెవఁడు?„]

జహా—మీరుమిగుల శ్రమపడుచున్నారు. ఊరకుండుఁడు

వైద్యు—మహారాజా! ఈయౌషధమును సేవింపవలెను.

షాజ—బిడ్డా! నీచేతితో—.........నాకు జీవింపవలయునని యింకేయాశలేదుగాని—ఆకట్టించుచున్న తాజ్‌మహల్—పూర్తియైనచో — ఆనందకరముగఁ జూచుకొని ప్రాణములవిడుతమనియున్నది నాశరీరముకూడ నందే భూస్థాపితముచేయఁబడునుగదా!

జహా—మీరిట్లనుచు—నన్నుదుఃఖముపాలుచేయుచున్నారు—ఇదిగో!—ఔషధము—

షాజ—(మందుత్రాగి) అమ్మ! నీది చల్లనిచేయి—

జీడా—(దగ్గఱకువచ్చి చేతులుజోడించి) మహారాజా!

షాజ—ఎవరది?—జీడా?

జీడా—స్వామీ!—ఔరంగజేబు మురాదులువచ్చి నగరమాక్రమించి దారాను బంధించి చెఱలోనుంచిరని తెలియవచ్చుచున్నది.

షాజ—(దుఃఖముతో నొసట మోదుకొనుచు) హా! హా! నాపాడుకడుపున నిట్టి దుష్టసంతానము పుట్టినదా!—

జీడా—మహారాజా! అంతటితోఁ దీరలేదు మీరున్న యీమందిరమునకు భటులను కాపుంచినారు—ఇదియే మీకు సైదట!—

షాజ—(రోషదుఃఖములతో)ఓరీ ఔరంగజేబు! విషసర్పమా! ఎంతపనిచేసితివిరా! దురాత్ముఁడా! కన్నతండ్రిని బంధిం

చుటయే—నీజన్మమునకు సాఫల్యమయ్యెనఁటరా పాపీ! నీవే యీ [illegible]కల్లోలములకు హేతువు—నీవొకఁడవు! ఆరోషనారా ముండయొకతె — ఆ పవిత్రమూర్తి ముంతాజ్ కడుపున నెట్లుపుట్టిరో! — సర్వనాశమైపోయినది! ఢిల్లీ సామ్రాజ్యమును క్రూరులు కల్లోలముల పాలుచేసి ముక్కముక్కలు చేసివేయుదురు. షాజహాన్ చక్రవర్తి నేటికి—కుమారులచే బంధింపఁబడినాఁడు—బంధింపఁబడినాఁడు—ఊఁ—ఊఁ—ఊఁ.

(ఆయాసపడును)

జహ—జహాపనా? మీరుమిగుల మాటలాడుచు నాయాస పడుచున్నారు! ఇది మీకాందోళన పడఁదగిన కాలము గాదు—శాంతముగఁనుండుఁడు—

షాజ—ఇంకేమున్నది? శాంతముకాక—అంతయును శాంతమే. నేను చచ్చునట్లులేదు—నాప్రాణములు పోయినచో సర్వకష్టశాంతియగును—ఈకొడుకులు—దొంగముండకొడుకులు.నాచావునకెదురుచూచుచున్నారు—(రాయబారిప॥)

రాయ—(తనలో) ఈనల్లని నీగ్రోవాఁడెవఁడు? జీడాయను పేరుగల భయంకరుఁడు వీడేకాఁబోలును. ఆరడుగులున్న రయెత్తున—నల్లనిబలిష్టాకారముతో—నిప్పులురాలు కన్నులతో — భుజమున గండ్రగొడ్డలిఁబెట్టుకొని, యమధర్మరాజువలెనున్న వీనింజూడఁగనే నాప్రాణములెగిరిపోవు చున్నవి. వీఁడు—షాజహానునకు నమ్మిన బంటట! నన్ను ప్రాణములతో బయటఁబడనిచ్చునో లేదో—

జీడా—ఎవఁడవునీవు?

రాయ—మురాదు మహారాజు పంపగా వచ్చితిని.

జీడా—మురాదు మహారాజా?—హుం—ఏమిరా నీపొగరు!—

జహా—జీడా! వాఁడు చెప్పవచ్చినదేదో చెప్పి పోనిమ్ము.

జీడా—నీగోడవ క్లుప్తముగ చెప్పి వెళ్లిపో—

రాయ—(భయముతో) చిత్తము—

షాజ—ఏమోయి! మీా మురాదు మహారాజు నాకు ఏమను పంపినాడా!—అట్లు పంపినను సుఖముగనుందురు.

రాయ—ప్రభూ! వారిట్లు మీాతో చెప్పుమనిరి. మిమ్మిగృహముననే ఖైదుచేసినాము; లోపలివారుబయటకు బయటివారు లోపలకు రావీలులేకుండ కాపుంచితిని—ఒక్క వైద్యునకు మాత్రము రాకపోకల కనుమతి యిచ్చితిమి—

జీడా—(రాయబారిని చెంపపై బలముగఁగొట్టి) లుచ్చా! ఏమిరా ప్రేలుచుంటివి—చక్రవర్తిని ఎవఁడో ఖైదుచేసినాఁడా? నీబాబుతో చెప్పుకో! ఈదెబ్బ నీ జన్మాంతము వఱకు చాలు—

రాయ—(క్రిందబడి గిలగిల తన్నుకొనుచున్నాఁడు)

జీడా—(మణికట్టు గట్టిగఁబట్టుకొని లేవఁదీసి) ఇక్కడనే చచ్చెదవేమి? లేచిపో—నీబాబుతో చెప్పుకో! వెళ్ళు—

(తన్నుచున్నాఁడు)

రాయ—(లేని యోపికదెచ్చుకొని పోవుచున్నాఁడు—)

జీడా—(ఆగ్రహముతోఁ దనలో) రండు—చావదలచిన వాండ్రెందఱెక్కువైనఁ రండు—ఒక్కొక్క దెబ్బతో నొక్కొక్కఁడు సరి.

(తెరవ్రాలును)

## దృశ్యము—౬.

ప్రదేశము—ఔరంగజేబు మందిరము.
ప్రవేశము—ఒంటరిగ ఔరంగజేబు ఫకీరు వేషముతో
సమయము—సాయంకాలము

ఔరం—(స్వగ) షుజా పారిపోయినాఁడు! మరల వచ్చునని తోచదు—మురాదు పాపము తానేమో యీ సామ్రాజ్యముం బరిపాలింపఁగలనని సుఖస్వప్నములం గనుచున్నాఁడు. వీనిగతి తుదకు కటారిపోటో-విషప్రయోగమో. దారాను ఛైలుపాలలోనుంచితిమి—కొంచెము శాంతముగఁ జంపినను చంపవచ్చును. తొందరలేదు. ఔరా! ఏమి నా మనస్థితి—ఈ ఫకీరువేషమేమి? ఈ సర్వనాశన ప్రయత్నమేమి?—అంతరాత్మ నిరంతరము నన్ను కలతవెట్టుచున్నది. ఎవరది?

(రోషనారా ప్ర॥)

రోష—సోదరా! ఈవార్త వింటివా?

ఔరం—ఏవార్త! రోషనా!—

రోష—పంజాబు దేశమున మనషుజా నెవ్వరో పొడిచి చంపినారఁట!

ఔరం—ఆఁ!—ఆఁ!—ఎంతమాట.

రోష—ఏమున్నది!—మనకు భగవంతుఁ డిట్లు సహాయము చేసినాఁడు—

ఔరం—రోషనా! భరింపరాని హత్యలు!—మనస్సునకు దారుణవేదనగనున్నది.

రోష—ఐన వేమున్నవి? కాదగినవి విశేషముగ నున్నవి.
ఔరం—నీ హృదయము నాకన్న కఠినము.
రోష—చక్రవర్తి విషయమేమి చేసితివి?
ఔరం—వైద్యునకుఁ గబురంపితిని; ఇఁక వచ్చును.
రోష—అధైర్యపడియెదవా – చేసిన కార్యమంతయుఁ జెడి పోవును!
ఔరం—అది నేనెఱుంగుదును!
రోష—నేను పోయివచ్చెదను జాగ్రత్తగఁ గార్యము సాధింప వలెను.
ఔరం—నీవుపొమ్మ.
రోష—(ప్రస్థానము)
ఔరం—(స్వగ) ఎంతదారుణము సలుపవలసి వచ్చినది! సరే! విచారింపనేల? ఏది యెట్లు జఱుగవలసియున్నదో యట్లు జఱుగకమానదు. రోట తలదూర్చి రోకటి పోటునకు భీతిల్లిన లాభమేమి?— (వైద్యుఁడు ప్ర॥)
వైద్యు—మహాప్రభూ! ఏమిసెలవు?
ఔరం—వైద్యమహాశయా! వచ్చితిరా! మీతోఁ పనియున్నది
వైద్యు—నాపని యేమున్నను చేతులు కట్టుకొని చేయుటకు సిద్ధముగ నున్నాను.
ఔరం—మీకడ విషమేమైన నున్నదా?
వైద్యు—(స్వగ) యీమహానుభావులని సంకల్పమేమోకద! ఏయదృష్టవంతుని ప్రాణములకు నేఁడంత్యము దాపురించి నదో?

ఔరం—ఆలోచించు చున్నావేమి?

వైద్య—విషమెందులకు!—మహాప్రభూ?

ఔరం—కారణము చెప్పదలంచియే యున్నాను. మీరుసం శయించినను తప్పునదిగాదు — బలమైనవిషమును మహా రాజు భుజించు పదార్థమునంగలిపి—యీయవలెను. ఏమి తెలతెలపోవుచున్నావు — మహారాజు రేపటికి బ్రతికి యుండగూడదు—తెలిసినదా? నీ కిదే శాసనము!

వైద్య—(చెవులు మూసికొని) అల్లా—నేనేమి జేయుదును. నేను కలగనుచుంటినా?

ఔరం—భిషజ్మణీ! నీవు కలగనుట లేదు. నీకీకార్యముతప్పదు. వినుచుంటివా?—ఇందువలన నీకు విశేషలాభము గలుగఁ గలదు.

వైద్య—మహారాజా! తమకు నేను వచింపవలసిన వాడను గాను. తమకుజనకులు—వృద్ధులు — రోగపీడితులు — ఇట్టి వారిని కారాగృహబద్ధులుగఁ జేయుటయే కడునింద్య మయినపని—వారినిసంహరింపుమని ననుబోటి సేవకమా త్రుని కానతిచ్చుటకు తమకు సామంతమున్నను—చేయుట కునాకు ధైర్య మెక్కడిది? మహాప్రభూ! — షాజహాఁ చక్రవర్తి నన్ను పోషించిన మహారాజు—ఆయన తిండి తిని నేనభివృద్ధిగాంచితిని—ఎవరి యుప్పు తిని బ్రతికితినో యాయన నోట విషముఁ బోయుటకు నాకు చేయిరాదు సరిగదా—మనస్సుచేనయిన దలంపజాలను. మహాఘోర ము! ఇంత ఘోరకృత్యముందునా! రాజకుమారా! నన్ను

క్షమింపుము — నీవింకేపని చేయుమన్న చేసెదను—కాని యిది చేయలేను—నీయాన మీరితినని నీవు నన్ను దండించి నను సరియే—

ఔరం—నాకు నీవు మారు జబాబు చెప్పవలదు. జరుగు చున్న కృత్యములు చూచు చుంటివిగదా? నీవునాకు తృణ మాత్రముగూడ కావు. నీప్రాణములు నాయరచేతిలో నున్నవి. తెలిసినదా? రేపీవేళకు నేను నీయింటికి వచ్చె దను-కృతకృత్యుండవైతివా! సన్మానింపఁబడెదవు. లేనిచో నా కటారియే నిన్ను పరలోకమునకంపగలదు. ఇది ఔరంగజేబు శాసనము. నన్నుతప్పించుకొని నీవెందును పారి పోజాలవు. పొమ్ము—

సైన్య—మహాప్రభూ—నామనవి—

ఔరం—నీవింకొక మాటాడవలదు; పొమ్ము—రెండే మాట లు—చక్రవర్తిని చంపనైన చంపవలయు; లేదా—నీవు చావనైనఁ జావవలయు—పొమ్ము—

సైన్య—(ప్రస్థానము)

ఔరం—రాజ్యములు తలక్రిందులగుచున్నవి—సముద్రములు కల్లోలములగుచున్నవి—ఆకాశము పిడుగులం గురిపించు చున్నది—తుదకిది యేమగునో—

(ప్రస్థానము)

## దృశ్యము ౭.

ప్రదేశము—వైద్యుని యిల్లు
ప్రవేశము—వైద్యుఁడు
సమయము—సాయంకాలము.

వైద్యు—హా! హా! పరమేశ్వరుఁడు తుదకు నాకెట్టి ప్రాప్తి ఘటించెను. ఈదుష్టపరిపాలనమున, నాయంతటనేను బ్రదుకుటయును—దోషమైపోయినదా! పరిపాలించు ప్రభువులే యధర్మమునకుఁ బ్రోత్సహించుచుండ నిఁక ప్రజల గతియేమి? కంచె చేనుమేసిన కాపునకుబ్రదుకేది?—ఛీ! ఛీ!—ఏమి? వీఁడా పాలించుప్రభువు?—వీనికి ప్రభునామమా! తండ్రిని చంపఁదలఁచి విషమునిమ్మని నన్ను ప్రోత్సహించిన కుటిలుఁడేటిరాజు—వీనికన్న చండాలుఁడుత్తమోత్తముఁడు—హా! హా! మొఘల్ సామ్రాజ్యమా! నీకెంతగతిపట్టినది! భ్రాతృశిరస్స్నానములగుండ రాజ్యమునకువచ్చిన దురాత్మునొకని వరింపనుంటివా? షాజహాను నిర్మించిన మయూరాసనమా! నీ సౌభాగ్యమంతయు నిక పాపులపాలఁబడునా?—పాపమెఱుఁగని ధర్మరాజుకు షాజహాన్ చక్రవర్తికి విషమునిమ్మనిన యీకుటిలుని నాలుక వేయిచీలికలేలకాదయ్యెను? ఛీ! ఛీ! దుష్టపరిపాలన మారంభమైనది. ఢిల్లీపురమున శ్మశానరాజ్యము వెలుఁగగలదు—సజ్జనుఁడెవ్వఁడు నీపరిపాలనమున బ్రదికియుండఁగూడదు. మానాభిమానములులేని పందలకు-దురాత్ములకు—రాక్షసులకు—నీరాజ్యమనుకూలమైనది—ఇప్పుడే ప్రాణములు వదలుటయే సర్వోత్తమమైనకార్యము. ఎవరది?—

"అటుదిటు—జరిగినది."]

(సేవకుఁడు ప్ర॥)

సేవ—దేవా! నేఁడుతమరౌషధమునిచ్చుటకై చక్రవర్తిగారి కడకు రాలేదఁట! పిలుచుకొనిరమ్మని సెలవైనది.

వైద్యు—(కన్నులు మూసికొని) హా! హా! చక్రవర్తిరమ్మనెనా? ఆసౌజన్యమూర్తి రమ్మనెనా?.........సేవకా! వైద్యుఁడు చచ్చెనని చెప్పుము-

సేవ—ఏమిసెలవిచ్చుచున్నారు స్వామీ?

వైద్యు—(తెలివిదెచ్చుకొని) ఏమంటిని రా?

సేవ—పలుకరానిమాటలాడుచున్నారేమి—నేఁడు?

వైద్యు—ఔను. ఏదియో ఆలోచించుచుంటిని—నేఁడునాకు శిరోభారముగనున్నదని మనవిచేయుము.

సేవ—చిత్తము-కోపువచ్చెదరుగాదా?

వైద్యు—ఆఁ-

సేవ—(పోబోవును)

వైద్యు—సేవకా

సేవ—చిత్తము-

వైద్యు—తుదసారి నేననేకసలాములుచేసితినని---నాతప్పులు క్షమింపుమని చక్రవర్తికిఁ జెప్పుము-

సేవ—మీమాటలు సంశయముగల్గించుచున్నవి-

వైద్యు—ఏమియులేదు-పొమ్ము

సేవ—(ప్రస్థానము)

వైద్యు—ఔరంగజేబు వచ్చువేళయైనది. నేను చక్రవర్తిని చంపలేదనివిన్నచో--మహాగ్రహమున నన్నుచంపును—

ఈ పాపాత్ముని చేత చావనేల? నేను షాజహానుచక్రవర్తిని చంపలేనుగనుక--నామరణమెట్లును--నిశ్చయమైనదియే కావున చక్రవర్తికీయదలచిన విషమును నేనేతిని మరణించి ఇంకనొకగంటలో నన్నుజూడదలచివచ్చు నౌరంగజేబుకన్నులు చల్లబడజేసెదను, ఈపాపాత్మునికీపరిపాలనముమాత్రి మెట్లుదక్కును—(విషముమ్రింగి) ఐపోయినది—నాయిహజీవిత నాటకము—సంపూర్ణమైనది ఈశ్వరా! నాదోషములను క్షమింపుము—నన్ను పోషించిన ప్రభుప్రాణములకై—నాప్రాణములను బలియిచ్చుచున్నాను—అబ్బ!- దాహము!—విషమహత్మ్యము—ఏమియును లేదు—పరమానందముగ నున్నది—కన్నులు పచ్చనై చెదరిపోవుచున్నవి—శరీరమునందలిబలము తగ్గినది—శరీరమంతయు తాపముగనున్నది—ఔరంగజేబ్ ఔరంగజేబ్—నిన్ను భగవంతుడు చిరకాలజీవిం జేయనున్నాడురా............ఆహా గుండెలలో బరువుగనున్నది—కంఠమున పెద్దయుండపెట్టినట్లున్నది—హా! ఈశ్వరా? బాధ—విషబాధ—తలకెక్కిపోయినది. (క్రిందబడును)

(ఔరంగజేబు ప్ర॥)

ఔరం—వైద్యశిఖామణీ! ఏమియిది?

వైద్య—ఐపోయినది-విషముతింటిని- (మరణించును)

ఔరం—కాలము!—అటుజరుగవలసినమరణ మిటుజరిగినది.

(తెరవ్రాలును)

షష్ఠాఙ్కమ్.

# తాజ్ మహల్.

## సప్తమాఙ్కమ్.

### దృశ్యము—౧.

ప్రదేశము—ఔరంగజేబు మందిరము.

ప్రవేశము—ఔరంగజేబు.

సమయము—మధ్యాహ్నము.

ఔరం—(విచారముతో) మనస్సు నిర్మలముగ లేదు. దారుణకార్యఘటనములచే తీవ్రమగు నాందోళనము బయలు దేరినది. పితృవధోద్యోగము చేసితిని—నిష్ఫలమయ్యెను. నిర్దోషియగు వైద్యుఁడు నాదౌర్జన్యకారణమున విషముఁదిని యాత్మహత్య చేసికొనియెను. నేఁడు చేయవలసిన కార్యము దుర్భరము—ఐనను చేసితీరవలయు—.............ఏల? ఫకీరునైతినని ప్రకటింపనే ప్రకటించితిని. ఖురాను చేతపట్టనే పట్టితిని. రాజ్యకాంక్షా పరిత్యాగము చేసి మక్కాకు పోవుదునా?—అదియే యుత్తమమార్గముగఁ గనఁబడుచున్నది—రక్తప్రవాహములలో నా రూపము ప్రతిబింబితమగుచున్నది. ఇఁక నేనీ ఘోరకర్మలను చేయలేను. మురాదును నిస్సంశయముగ మోసగించితిని. పాపమా యమాయికుఁడు—తాను చక్రవర్తి

నగుమనని యువ్వి ళ్లూరుచున్నాఁడు. తన వెనుకభాగము నుండి వెక్కిరించుచున్న మృత్యుదేవతను గుఱుతింపకున్నాఁడు—మోసము పరిపాలించుచున్నది.

—(రోషనారా ప్ర॥)—

రోష——సోదరా!—ఆజ్ఞాపత్రిము లిఖించుట యైనదిగదా!

ఔరం——సోదరీ!—దారామరణమున కిప్పుడేమి తొందర?

రోష——ఆఁ!——ఏమిది?........నీమనస్సు మెత్తఁబడుచున్నట్లున్నది—తొందర యే మనుచుంటివా? — అంతయునుఁ దొంగఱయే—కా కేమున్నది. శత్రుశేషము—అగ్ని శేషముః—ఋణ శేషము — మిగుల్పవచ్చునా! — ఎంతయవివేకము?—

ఔరం——కోఱలుతీసిన పామువలె—కారాగృహమునఁ బడియున్న దారాను చంపివేయకున్న నాయసహాయవ్యక్తి మనల నేమిచేయఁగలఁడు?

రోష——అసహాయవ్యక్తి? — ఎవఁడే వేళకు సహాయవ్యక్తియో చెప్పఁగల్గిన వా రెవ్వరైనఁ గలరా?—ఆలస్యమైన తొలఁదియు నమృతము విషమై పోవును! కప్ప కాలసర్పమగును—పిల్లి బెబ్బులి యగును—కాల మిట్టి విపరీతములనైనఁ గల్పింపఁగలదు—నేడు తలంచినదానినిఁ నేడే చేయనలయును. తప్పదు—నీ విందేమియు నాలసింపరాదు—అన్న యను కనికరము వహించి దారావధయందు నీవు వెనుకదీయుటకన్న దారా కీ సింహాసనము నిచ్చి తొలఁగుట మంచిది. ఎంతెంత వ్యూహములు పన్నితిమి! ఎన్ని

కార్యము లొనర్చితిమి! అంతయును వ్యర్థముచేయకుము—నే నావల తలవరులను సిద్ధముగ నుంచితిని! ఆజ్ఞాపత్రిమును చూపి—వారు చెఱసాలయందే దారాను హతమార్తురు. మురాదుతో నిప్పుడే యట్లు చెప్పివచ్చితిని- ఇదిగో! లేఖని—ఇదిగో మషీరసపాత్రి—వ్రాయుము—ఆజ్ఞాపత్రికను— (ఇచ్చుచున్నది.)

ఔరం—స్వగ) ఏమి! చాంచల్యమున వెకలినైతిని. చిత్తమా! ధైర్యముఁ దెచ్చుకొనుము—

(వ్రాయుచున్నాడు.)

రోష—తలవరులారా!

(తలవరులు ప్ర॥)

ప్రిథ—మహారాణీ! ఏమిసెలవు!

రోష—నేను చెప్పినపని యందు మీరు జాగరూకులై యుంటిరిగదా!

ప్రిథ—చిత్తము.

రోష—ఆజ్ఞాపత్రి మిప్పుడే మీ కీయఁ బడును.........సోదరా లిఖించుట నైనదిగదా!—అదేమి నీచేయి వణకుచున్నది! మరల నున్మాద మేమైన నావేశించినదా!—

ఔరం—సోదరీ! రోషనా! మహాఘోర కార్యము! నేనుచేయలేను. దీనిపై నేను సంతకము చేయలేను—అబ్బ! హత్యలపై హత్యలు చేయు సంకల్పములందే నాహృదయము విదారితమై పోవుచున్నది—హా! పశ్చాత్తాపము—హృదయము - మానవహృదయము -

రోష——ఉన్మాదము—కార్యశూరత లేని యసమర్థోన్మాదము ఛీ!—ఇంతటిపౌరుషశాలివని తొలుత నెఱింగియున్న నిట్టి దుర్ఘట ప్రయత్నమును నేనేల చేసియుందును?—ఈ సమర్థత్వై—యీ ఫకీరువేషమేల? ఈ యుద్ధసన్నాహమేల? ఈ సోదర నయవంచనమేల? ఈ పితృబంధీకరణమేల? ఈ విషప్రయోగ ప్రయత్నమేల?—అంతయు నారంభ శూరత్వము—నిజముగ నీవు చేసిన దేమున్నది? అంతయు నేనే చేసితిని. నిన్ను నిమిత్తమాత్రముగ—హిందూ దేవాలయమునందలి శిలావిగ్రహమువలె నిలిపి — సామ్రాజ్యమమర్చిపెట్టినిన్ను చక్రవర్తిం జేయవలయునని, యవ్యాజ భ్రాతృవాత్సల్యమున, ప్రయత్నముచేసితిని—దురంత ప్రయత్నముచేసితిని—తల్లిదండ్రులకు విరోధము గల్పించుకొంటిని—అక్కను నిర్భాగ్యురాలిం జేసితిని. ఆహ్మానదోలోకమున కణగఁద్రొక్కితిని. దారాను చెఱనువేయించితిని. మురాదును వంచించు నుపాయముంజెప్పితిని—తండ్రిని బంధించితిని! - ఎవరికొఱకు? ఎవరికొఱకీ ఘోరకార్యములను నేనుగావించితిని? మతిలేదా నీకు? నీవుబుక్కా—ఫకీరు నయ్యెదనని సిద్ధమైనచో నాకీవైభవమేల? మురాదునో దారానో రాజ్యమేలుకొననిచ్చి-నీవు మక్కా-కుఁబొమ్ము. నాకీ కటారి చాలు-ప్రయత్నభంగమైనపిదప నేను బ్రదుకలేను. ఇప్పటికే రోషహరా చెడ్డది చెడ్డది లోకులందఱు ననుకొనుచున్నారు - అధికారములేకుండ నేను బ్రదుకనేని నన్ను కాకులవలె పొడిచివేయుదురు - ఇంతయధైర్య

మాప నీతరముగాదు—తలవరీ! నీవు సొమ్ము—ఇదిగో కాగితము.

తల—(ప్రస్థానము)

ఔరం—(తలపట్టుకొని చింతించుచుండును)

(తెరవ్రాలును)

## దృశ్యము—౨.

ప్రదేశము—కారాగృహము.

ప్రవేశము—దారా బంధితుండై.

సమయము—సాయంకాలము.

దారా—(విషాదోన్మాదములతో) పండితుల మాటలు వృథా? వృథా? భగవంతుఁడను వాఁడు లేఁడు; ఉన్నచో—నీదురాగతముల నేల సైరించును. ధర్మప్రతిపాలనము వ్యర్థమే? మహారాజపుత్రుని కారాగృహవాసుఁజేయునా పరమేశ్వరుఁడున్న?—రాజ్యలక్ష్మీ! నీవు కడు చంచలరాలవు! గ్రుడ్డిదానవు—క్రూరురాలవు—కానిచో—నిన్ని హత్యలు చేయించి ఇన్ని ఘోరముల నీక్షించి—యౌరంగజేబును జేరుదువా? సజ్జనులను నీవు వరింపలేవు—సన్మార్గమునకు నీకుఁ గడుదూరము.....సాయంకాలమగుచున్నది, సూర్యుఁడస్తమించుచున్నాఁడు (వినుటనభినయించి) అదిగో! ఐదుగంటలు—జగదంతరాళ ప్రాచీరములనుమ సూర్యుఁడస్తమించెను—ఈ కారాగృహాంతర్భాగమునను సేనస్థలిం

తును. అస్తమింతును.....అస్తమింతును.....నిజమే—
విచారములేదు కాని ఆజగన్మోహిని—ఆ ప్రేమమయి—
ఆనిర్భాగ్యురాలు— ఆష్మాజ్—ఆష్మాజ్ గతి యేమగును?
కుటీరమున జమాదారు కప్పగించి వచ్చితిని. ఇఁక నేనా
ష్మానున కెవ్వడను? ఆష్మాజ్ నాకెవ్వతె?—ఆదివ్యమంగ
ళాంగమును నేనిఁక నీజన్మమునఁ గాంచలేను. ప్రకృతికి
మమ్ము చూడఁ గన్నులు గుట్టెనవి. — విడదీసినది—అంతతో
నోర్చియుండలేదు. శాశ్వతముగ సంయోగము కాకుండు
నట్లు చేసినది — భగవదుద్దేశ్యమును నిర్వహించుటలో
ప్రకృతి పరిచారికామాత్ర—ఆది యేమి చేయఁగలదు? నా
జీవిత మిట్లైపోవలయునని భగవదభీష్టము కాఁబోలును
ఐన నాకీ విచారమెందుకు? షాజహాన్ చక్రవర్తి నెమిలి
సింహాసనము నెక్కుట కౌరంగజేబునకో—మురాదునకో
భగవంతుఁ డధికారమునిచ్చినాఁడు——పాపము చక్రవర్తి
నేమి జేసిరో కదా — దుర్మార్గులు! క్రూరులు! చక్రవర్తి -
శతవృద్ధుఁడు - రోగపీడితుఁడు - ఆముసలివాని ముప్పదిన
ములు - చల్లగ గడుచునట్లు లేదు - నా ప్రాణము లీకారా
గృహామధ్యమున ఘోరహంతకులచే వధింపబడినను వృద్ధ
చక్రవర్తి సన్మరణముఁ గాంచినచో - నాయాత్మ మహా
సంతరముగ నెడలిపోవునుగదా! - ..........ఎవరో
యీవంకకు వచ్చుచున్నారు.

(తలవరులు ప్ర॥)

తల—మీతల సహకునుని మహారాజు యాజ్ఞయైనది.

దారా—ఎవరుమీారు? తలవరులేనా?
తల—ఔను.
దారా—సరే - నాకర్థమైనది. నేనింకేమి చెప్పుదును - మీా పని కానిండు-

(శోకముతో - అష్మాక్ ప్ర॥)

అష్మా—నా హృదయాధినాథా! నా ప్రాణమా! నాసర్వస్వమా! (కౌగలించుకొనును)
దారా—హా! హా! ఏమిది! చరమకాలమున దేవతాదర్శనము.
అష్మా—నాథా! ఏమిది! తమకీదుర్గతి! పాపపు విధిమనలం జూచి యోర్వలేకపోయెనో..........హా! హా! ఈతలారులేమి?.........చివరకాలమేనా?...అదియు దటస్థమైనదా! ఇంకేమున్నది! ఇంకేమున్నది!
ప్రథ—ఏమియీా యాందోళనము - ఎవరీమె—
అష్మా—తలవరులారా! నానాథుని జీవములకు మారుగనా జీవితముల నిచ్చెదను! మీా పాదములం బడెదను! ఆ మహాభాగుని జీవములం దీయకుండు. అన్నలారా! ఏమియాలోచించెదరు? మీాకు మాటరాకుండ నారక్తముంజూపుడు! యీాయన ఫకీరయి మక్కాకేగి బ్రతుకును. మీా మేలు మరచిపోవండు - మీాకొక సోదరియున్న నామె కోరిక నెరవేర్చెదరా!
ప్రథ—లేమ లేవ—అవలకుం బొమ్ము మాపని దీర్చుకొందుము.

[ఇదికటారి—ఇదినావక్షము,,?

దారా—నాయన లారా! నేను సిద్ధముగనున్నాను - మీరు సంశయింప వలదు ఆడుదియగుట - ప్రేమవశమున, నమాయికత్వమున - తెలియక తన ప్రాణముల నిచ్చె దననుచున్నది; అక్కఱలేదు. ఇంక నీ దారాకు జీవితాశ లేదు - హీనముగ చెఱసాలనుండి పారిపోయి ఫకీరునై బ్రతుకుటకన్న, నిచ్చట మీ చేతులలో చచ్చుటయే యుత్తమమని నాకుం దోచుచున్నది కాని, నాదొక మన వి యున్నది.

ప్రథ—అదియేమి? -

దారా—మా యమ్మగారు - మీ చక్రవర్తిని. - ఏపూజ్యు రాలికై తాజ్ మహాలును చక్రవర్తి నిర్మించెనో - యా పుణ్యాత్మురాలగు ముంతాజ్ మహల్, ప్రేమతోం బెంచు కొనిన యాప్మాన్ బీబీ యీ సుశీల -

ద్వితీ - ఏమి! - ఆప్మాన్! బీబీయా

దారా—నాయనలారా! అవును, విధి దుర్విపాకమున నాకీ దుర్మరణము ఘటిల్లుచున్నది. సచ్ఛీలవతి హృదయపూ ర్వకముగం బ్రేమించియున్నది. నాచరమ సమయమున నీమెకు రెండు మాటలు చెప్పెదను - ఐదు నిముసములు గడువీయవలయును -

ద్వితీ—అటులే కానిండు - ఇందు మాకు చెడిన దేమి? - మే మావలద్వారమున నుందుము; రారా - పోదము.

—(తలవరులు (ప్రస్థా)

దారా—ప్రియా! అస్మా! నీ వెట్లు వచ్చితివి! అహోహో! పరమేశ్వరుఁ డెంత కృపాళుఁడు! ఈ మరణకాలమున నీ సుందరముఖదర్శనమును బ్రాప్తింపఁజేసినాఁడు.

అస్మా—నాథా! ఆకుటీరమునకు - షుజా యొకనా డౌరంగ జేబువలని భీతిచే వచ్చి నాచే రక్షింపబడి మధుపానమత్తుఁడై నా పైఁబడరాగా - నాకుటిలుని నాకటారి పాలు చేసి, యిట్లు పలాయనమై మీ పాదసన్నిధికి వచ్చితిని

దారా—హా! హా! ఏమి? షుజా నీవలననే దుర్మరణము పాలయ్యెనా! పాపము!

అస్మా—ఆత్మమానరక్షమునకై-మీాతమ్ముని వధించిననాతప్పు క్షమింపవలయును.

దారా—ప్రియా! ప్రాణరక్షణము చేసిననీ సౌశీల్యమునే భంగముచేయుటకుఁ బాల్పడిన యాకుటిలుని నాసోదరుఁడని చెప్పుకొనుటకు నాకు మిగులసిగ్గగుచున్నది—రక్త సంబంధము వలని విచారము చేత, కొంచెము వగవవలసివచ్చె.—.........నాకు మరణము తప్పదు, నాసోదరుఁడు ఔరంగజేబునన్ను బంధించి తలవరులచే వధింపఁజేయుచున్నాఁడు. ప్రియా! నన్ను మఱచిపొమ్ము--నేను నీకు తెలియక — కొన్ని యప్రియములు సల్పియుందును వానిని క్షమించి నన్ను మఱచిపొమ్ము — నేనిఁక నీకుఁ గనఁబడను

అస్మా—హా! ఏమిది! ప్రియా! నీకొరకు బ్రతికియుండి నాకొరకు బ్రతుకుదునా? నేను నీకోటకు దానినే—

దారా — ఆహా! నీపలుకు లమృతముల చిలుకుచు నా కత్యా
యానందమును ఘటించుచున్నవి — ప్రియా! పరలోకమునకు మనమిద్దఱ మేకకాలమున నరుగుట మనకు కల్యాణమే సుమా!—కాని, సాధనమేమున్నది?

అస్మా — నాథా! ఉండలేదా మీరిచ్చిన కటారి నావద్ద—దీనితో నన్నుఁ బొడిచి మీరు పొడుచుకొనుఁడు. ప్రేమపాశబద్ధులమగు మన మొకరినొకరము కౌగలించుకొని నిశ్చింతతో బ్రాణములను విడిచిపోవుదము.

దారా — ఆహా! భగవచ్చిత్రము! మా కెట్టి ప్రాప్తి ఘటింప జేసెను! ఈశ్వరా! నన్ను నమ్మియున్న యమాయికురాలిని, నా జీవనములలోని జీవనమగు నా ప్రియేశ్వరిని, నా చేతులతో నఱికివేయఁగల నా? నావలనఁ గాదు—కటకటా నేనెంత ఘోరపాతకుఁడను. నేను మానవ జన్మముఁ దాల్చుటకుదగను—

అస్మా — నాథా! త్వరపడుము; తలవరులు మనకనుగ్రహించిన గడువైదునిముషములునైపోయినది—మనము తొందరపడకున్నచో—మన కల్యాణము కాఁజాలదు. నీవేల దుఃఖపడెదవు! ఇందు నీకు హత్యాదోషము రవంతైన లేదు. ఈ యానందమును సైతమనుభవించి మరణింతము. మరణకాలమునఁ బ్రియులను గాగిలించుకొని—వారి యానందమయ ముఖకమలముం జూచుచు — వారిదృష్టులందు తమదృష్టులను లీనముచేసియటులే మరణించిన వారీ భూమిపై నెవ్వరున్నారు! ఇది మనకు మహా పర్వదినము—

ప్రణయానుభవముం గన్నవారు—రసజ్ఞులగువారు—మన యుదాహరణమే—సర్వరాజ్యాభిషేకమున కన్న—యిహలోక కల్యాణమునకన్న నధికమని భావింతురు. మన ప్రణయ నాటకమున కిదియే మంగళాంకము — ప్రణయప్రపంచక మునకు మనచరిత్రమే యుత్తమగ్రంథము—నాథా! ఆలస్య మేల? ఇదిగో కటారి వాడిగనున్నది — ఇదిగో నావక్షము మీాకెదురుగనున్నది.

దారా—నా సామ్రాజ్యలక్ష్మీ! నాహృదయాధీశ్వరీ!—నాకు చేతులాడుట లేదు.

ఆస్మా—నాథా! సంశయించి కార్యచ్ఛేదము చేసెదరా? అదిగో తలారులు—

దారా—ప్రియా! ప్రియా! ఆస్మా!—నన్ను క్షమింపుము— నన్ను ప్రేమింపుము—

ఆస్మా—ప్రియా! ప్రేమించుచుంటిని—మన సార ప్రేమించు చుంటిని. నన్ను పొడువుడు—

దారా—హా! ఇదితప్పదు—పరమేశ్వరా! ఇదిగో కడకు వచ్చు చున్నాము

(ఆస్మాను పొడిచి తాను పొడుచుకొనును)

తలా—(ప్ర॥) ఏమిది? ఆశ్చర్యము — రెండుశవములు మన కష్టము తప్పినది.

(తెరపడును)

## దృశ్యము—౩.

ప్రదేశము—మురాదు దర్బారు.

ప్రవేశము—ఔరం॥ మురాదు-రోషనారా-ఖాజీపరివారము.

సమయము—పదిగంటలవేళ ఉదయము.

ఔరం—మీరాజుమ్లాను నేను విశ్వసింపఁజాలను-దొంగ-

రోష—ఔను. ఏప్రభువు నాశ్రయించునో—తుదకు వాని నాశనము నేనూచు జాతకము వానిది.

ఔరం—సేవకా!

సేవ—చిత్తము.

ఔరం—మీరాజుమ్లాను పిలువుము.

సేవ—(ప్రస్థానము)

ఔరం—మీరాజుమ్లాను ఆసాముకు పంపివేయుదును.

(రాయబారి ప్ర॥)

రాయ—మహాప్రభూ! సలాము—

ఔరం—నీవు వెళ్లివచ్చిన పని యేమైనది?

రాయ—మహాప్రభూ! ఏమిచెప్పుదును! ప్రాణవశిష్టుఁడనై తిరిగివచ్చితిని.

ఔరం—నిన్నెవ్వరు ప్రహరించిరి?

రాయ—ద్వారమున నున్నాఁడు; నీగ్రోవాఁడు—భయంకరాకారి—అంతయుఁజెప్పనిచ్చి చచ్చునట్లు కొట్టిపంపినాఁడు చేయి విఱిగిపోయినది. చెంప అదిరిపోయినది. జహానారా బేగం—వారిఁ పనితో నాపని యట్లుండవలసినది.

ఔరం—ఏమి యీ దురాచరణము!

రాయ—వాఁడొకరికి వశముకాఁడు! ప్రభూ—

ఔరం—సేవకా! జీజాను నేను రమ్మంటినని చెప్పుము.

సేవ—(ప్రస్థానము)

మీర్‌జుమ్లా—(ప్రవేశించి) జనాబ్-సలాం—

ఔరం—అదిగో! వచ్చితివా!—.........నీవు కొన్ని దినములా సామునకరిగి, యచ్చటికలంతల నణచిరావలయును.

మీర్—చిత్తము—ఇచ్చట నాపని—

ఔరం—నీపనిని, నీకుమారుఁడు చూచుచుండును!

మీర్—చిత్తము—మరల నారాక?

ఔరం—మురాదు సర్కారు వారి సెలవైనప్పుడు—

మీర్—భాగ్యము

ఔరం—ఇఁక నీపనిమీఁద నుండుము పొమ్ము.

మీర్—(ప్రస్థానము)

రోష—(అప) వీని కుమారుఁడేల? వీని పని చూడఁగలడా?

ఔరం—(అప) వీని పని యిక్కడ మాత్రమున్నది! వీఁడులేకున్న రాజ్యాంగమును నడుపువారే లేరా?

రోష—(అప) మరి వీని కుమారుఁడేల?

ఔరం—(అప) వీఁడాసామున కలతలు పుట్టించినచో నిచ్చట గిట్టించుటకు—

(జీజా భటులతో ప్ర॥)

రాయ—(భయపడుచు నొకమూల నిలుచును.)

ఔరం—జీజా! నీవే రాయబారిని ప్రహరించినావఁట!

ఔరం—రాజశాసనాతిక్రమణ దోషమునకై—నీవు శిక్షింపఁబడుదువు.

జీజా—అనుభవించెదను.

ఔరం—అంతేకాని, మురాదు సార్వభౌముని యానతులు మన్నింపవు?—

జీజా—మన్నింపను.

ఔరం—నీవు బలవంతుఁడవని యందఱికి నిర్లక్ష్యము చేసిన లాభములేదు. పలువురు నిన్ను బంధింతురు — నిన్ను శిక్షింతుము.

జీజా—మీకంత శ్రమ యెందులకు? నా శౌర్యమును మీ యెదుటఁ జూపిన లాభమేమి? శిక్షించుటకే కదా సుపుత్రులగు మీవు తండ్రి కడుపునఁ బుట్టితిరి! శిక్షింపుఁడు.

ఔరం—ఖాజీసాహెబ్! రాజశాసనము నతిక్రమించిన వారి కేదిశిక్ష?—

ఖాజీ—మరణశిక్ష.

ఔరం—జీజా!—నీకు మరణ శిక్ష విధించితిమి!

జీజా—మీరి దుర్మార్గరాక్షస పరిపాలనమున జీవించుటకన్న మరణమే శ్రేయము.

ఔరం — మంచిది..........సేవకులారా! వీనింగొనిపోయి తలవరులకప్పగింపుఁడు?—

ఖాజీ—మహారాజా! మరణదండన విధించునప్పుడు — వాని ప్రాణములు దప్ప—నేదైన నొక కోరికఁ దీర్పవలయు—

ఔరం—జీజా! నీకేమి కోరిక యున్నది!

జీడా—(స్వగ) ఈ దుర్మార్గుని ఖాజీని బ్రతుకనీయఁగూడదు నాకు మరణదండనము విధించిన యీ పాపాత్ముని వలన నింకెందఱు హతముగానున్నారో! — (ప్రకా) నా కేమి కోరికయున్నది? నేను విద్యాగంధములేని మూర్ఖుఁడను— బ్రదికినన్నాళ్లు పెద్దలన్ననేమో—దైవమన్ననేమో ఎఱుంగను. ఇఁక చావనున్నాను. ఈఖాజీ మహారాజు మనకు గురువు-పూజ్యుడు. ఈయనకు వందనము చేయవలయునని యున్నది.

కొరం—అటులే కానిమ్ము.

ఖాజీ—ఓరీ—అటులే నమస్కరింపుము. నీ యాత్మకు శాంతి యగుఁగాక! —

జీడా—(నమస్కరించి సల్లభినయించి ఖాజీపాదములు పట్టుకొని నేలకు విసరికొట్టి గుండెలపైగ్రుద్ది చంపుచున్నాడు)

ఖాజీ—హా! హా! మోసము? —

(మరణించుచు)

జీడా—దుర్మార్గుఁడా!—మోసమా!—ఎన్ని మోసములనో చేసిన చండాలుని చంపుట మోసమా! నీకు చిత్రవధ తగియున్నది.—అంతఃపుర కల్లోలములకుఁ గారణమే నీవు—దుష్టగ్రహమా! (తన్నుచున్నాడు)

రోష—సోదరా! ఇంకచూచెదవేమి? ఈ కుటిలుని తలపకల కప్పగింపఁ బంపుము—

కొరం—సేవకులారా!—ఈజీడాను జాగ్రత్తగఁ గొనిపొండు—

జీహా — (కోపముతో) నేను మంచిచావు జావఁబోవుచున్నాను. ఓసి కుటిలహృదయా! రోషనారా! ఓరీ దుష్టవ్యాళమా! ఔరంగజేబు! మీరెట్టి హీనపుబ్రదుకు బ్రదుకనుంటిరో తెలిసికొంటిరా! ఈ శ్మశానరాజ్యమును మీరిఁక నేలుకొనుఁడు. ఈ ధనపు సంచులను మీఁదనైచుకొని తగులఁబడి పొండు.—

(సేవకులంతో ప్రస్థా).

## దృశ్యము—౪.

ప్రదేశము—మురాదు మందిరము.

ప్రవేశము—రోషనారా—మురాదు—ఔరంగజేబు.

సమయము—రాత్రి.

రోష—సోదరా! మురాద్! సర్వశత్రుసంహారమైనది. నేఁటి దినము మనకానంద దినము! ఈరాత్రి మనము సంతోషముగ నుండవలసిన దినము—మనము నేఁడీయంతఃపురమున నేకలసి విందారగింపవలయును.

మురా—ఇదినాకును సమ్మతమే.

ఔరం—(స్వగ) పాపము! మృత్యుదేవత వీనికై ఎదురు చూచుచున్నది! ఏఁడు రాజ్యమునకై యెదురు చూచుచున్నాఁడు.

మురా—సోదరా! నీవేదియో, ఆలోచించుచున్నావు?

సాదు—ఐనది.

ఔరం—మురాద్! ఈసాదుల్లా-హిందువుడైనను మహమ్మదీయ మతస్వీకారముచేసి, మనకుమంత్రియై-చిరకాలము నుండియు సేవించుచున్నాడు. ఇతడు మిగులవిశ్వాస పాత్రుడు. నేను మక్కాకేగినను; ఈతడు నీకు బాసటగ నుండును.

సాదు—నేనిక నాపనిమీద నుందును.

మురా—మంచిది.

సాదు—(ప్రస్థానము)

(వంటవాడు ప్రవేశించి వడ్డించుచున్నాడు)

వంట—ఇవి సాలన్లు—ఇవి కిచడీలు—ఇవి పలావులు—ఇవి క్షీరములు—(ప్రస్థానము)

ఔరం—కొందరవివేకులు—సంతోషము కొఱకు విందులు చేయునప్పుడు మధురసమును వాడుదురు. ఇది మిగుల దురభ్యాసము!

రోష—తాగుటకిట్టి మధుర పానీయము లెన్నియుండలేదు?

(అందఱు భుజించుచున్నారు)

ఔరం—(రోషనారాకు సౌజ్ఞ చేసి)నాయనా! మురాద్! నీ యభివృద్ధికై—నీ యభ్యుదయమునకై—మన యక్క రోషనారా మిగుల తాపత్రియపడినది. నీ వీమె ఋణమును దీర్చుకొనలేవు, కాన నీమెయందు కృతజ్ఞుడవై యుండవల యును.

రోష—(మురాదు చూడకుండ క్షీరమున-విషము కలుపు చున్నది)

మురా—నీవు లేనిసమయమున—నా కామెసహాయమే సర్వ విధముల ననుకూలము. కాక ఇఁక నెవ్వరున్నారు?

రోష—నేనేమి చేసితిని? అంతయు నీవు సల్పినకార్యమిది! అందు నీవు విరాగివగుటచే నిట్లు జరిగినది. కానిచో నీదు ర్మార్గ సంఘమున మన మురాదును చూచువారెవ్వరు? అతని మేలుకోరిన వారెవ్వరు?

ఔరం—(స్వగ)అవును. నిజము చెప్పితివి. ఈ దుర్మార్గసంఘమున నతని మేలుకోరిన వారెవ్వరు?

రోష—రాత్రి కాలమందు క్షీరపాన మారోగ్యకరమైనది. కావున మన మురాదు నిత్యసౌఖ్యమునకై క్షీరపానము చేయుదము.

(క్షీరమును మువ్వురు త్రావుదురు)

ఔరం—(స్వగ) విషపానమైపోయినది;అకటా! ఇకనైదు నిముసములలో మరియొకహత్య జఱుగనున్నది.

మురా—నా కడుపున నేమో వికారముగ నున్నది.

రోష—వైద్యునిఁ బిలిపింతునా!

ఔరం—భోజనసమయమందు వైద్యుఁడేల? కొలఁది సేపటి కదియే నివారించును.

రోష—అయ్యయో—రేపు పట్టాభిషేకమును సంకల్పించు కొనుటేమి?—ఈ రాత్రి యీ విపరీతమేమి?

ఔరం—సోదరా! ఏమి! వికారమణఁగలేదా?

మురా—అణఁగు టెక్కడిది? విపరీతముగ నున్నది—ఇదేమి బాధ—కన్నులునుతిరుగుచున్నవి. శిరస్సు బరువుగనున్నది—గుండెలలో నేదియో కాల్చుచున్నది........అయ్యో య్యో — వైద్యుఁడు—వైద్యుఁడు—ఏదైన నౌషధమున్న బాగుండును. నా పదార్థములలో నేదియో విషము కలిసియుండును—మోసము జరిగినది — సోదరా—సోదరా—ఏమియిది — బంఁగారి? హామా—మిత్రద్రోహమా—పరిజనద్రోహమా—.....హా హా ఏమి యీ దాహము—పానీ—పానీ—

రోష—(ఆనందముతో) ఇదిగో జలము........అయ్యో—ఇదియు వట్టి కలశమే—(అటునిటుఁ జూచి) వంటవాఁడు పయితము దగ్గఱలేఁడు!—బావర్చి! బావర్చి! ఈ బద్మాష్ పని వదలి యెచ్చటికిఁ బోయెను—

ఔరం—(స్వగ)రోషనారా! రోషనారా! నీ వెంతటి భీకర వ్యక్తివి! నన్నేమి చేయఁదలంచితివో—

రోష—కన్నులు తేలవేయుచున్నాఁడు!—మురాద్! తెల్లవారిన నీ పట్టాభిషేకమహోత్సవము! లే లెమ్ము—

మురా—(వికార స్వరముతో) ఛీ! దుష్టులారా! మీరే నన్ను మోసము చేసి—నాకు విషము పెట్టితిరి!—నాకు విషప్రయోగము చేసి చంపుచున్నారు! — దురాత్ములరగు మీ మోసముంగనిపెట్ట జాలక అధః పతితుఁడనగుచున్నాను. హా హా! శరీరము మండుకొని పోవుచున్నది. కన్నులనుండి యగ్నిస్ఫులింగములు వచ్చుచున్నవి—రోష

నారా—నిన్ను—సోదరివసి! నఖ్కు—అబ్బ—గుండెలు పగుల వేయుచు పెద్దపోటు బయలుదేరినది—అల్లా—నీ సన్నిధికి త్వరగఁ జేర్చుకొనుము—నే నీ బాధపడలేను.........
భాయీ! ఔరంగజేబ్!—నీకు సలాము చేసెదను. నాకీ పిశాచరాజ్యము వలదు—నీకు శత్రుత్వము నేనెప్పుడుఁదల పెట్టలేదు. నన్ను బ్రదికించి పుణ్యముఁ గట్టుకొనుము—ఒక వైద్యునిఁ బిలిపించి నన్నుఁ జూపుము—అబ్బబ్బ నాలుక పై తడిలేదు—దాహము — దాహము — జింహాదోషము బయలుదేరినది— ఒక జింహాదోషమేమి?—సర్వదోషము లును—ఇఁక బ్రదుకను. ఆశలేదు — తండ్రి! నిన్ను చెఱను వేయించిన పాపము నాకుఁ దగిలినది—దుష్టా దుర్మతీ ఔరంగజేబ్—దాహమురా పాపీ!—పులిసెడునీళ్లు!—మహా రాజపుత్రుఁడను—నాకు నీటికి గతిలేకపోయినదా—హా—చండాలుడా—నీకిట్టి దుర్మరణమే కలుగునులే!—రోషనా-నీవు దుర్మరణము పొలగుదువు—హా! బాధ—బాధ—మరణ వేదన — విషప్రయోగము — దాహము — దాహము—

(మరణించును)

రోష — కంటకము లన్నియు నిర్మూలనమైనవి — సోదరా! ఔరంగజేబ్! అందరి శాపములును దీవనలుగ వీరి రక్తమే యభిషేకము గ—వీరి శిరస్సులే సోపానపంక్తిగ—రేపు—సింహాసనమునకు విరుదముతో ఢిల్లీ మయూరాసనము నధిరోహింతువుగాక

(నిష్క్రమింతురు)

దృశ్యము—౧.

ప్రదేశము—ఢిల్లీపురవీధి

ప్రవేశము—గోవిందదాసు

సమయము—ఉదయము.

గోవిం—(ఆలోచించుచు) కాలమెంతమార్పుదెచ్చినది! ఢిల్లీ సామ్రాజ్యమింతలో నిట్లుమారునని యెవ్వరు తలంచిరి! ఔరంగ-జేబు-ఆలంఘిరు బాదుషాయై-ఢిల్లిలో పరిపాలన మారంభించినాఁడు హిందూమతద్వేషమారంభమైనది. ఆహాహా! ఈ క్రూరుఁడెంత మోసముఁజేసిరాజ్యమునకు వచ్చినాఁడు ఎందరిని వధించినాడు! రోషనారా యొకతె—వీనికి తోడై సామ్రాజ్యము నల్లలనాడించినది! మమ్ముఁ బోషించిన ప్రభువు, దారామరణించినాఁడు-విద్యాపోషణ మాతనితోడనే యస్తమించినది. ఇంక నీరాజ్యమునందుండఁగూడదు. నామిత్రుఁడు న్యూటనేమయ్యెనో—

(న్యూటన్ ప్ర॥.)

న్యూట—అదుగో—నామిత్రుఁడు గోవిందదాసుగారు—

గోవిం—న్యూటన్ దొరగారా! నేను మిమ్మేతలంచుచుంటిని. ఇకఁమనకు బ్రతుకు దెఱువుపోయినది.

న్యూట—(ఒకకాగితము జూపుచు) కాళీఘట్టము ఈస్టిండియాకంపెనీలోన నాకుద్యోగము దొఱకినది ఇఁక నీఢిల్లీ పురమును వదలవేసి కాళీఘట్టము వెళ్లదలఁచియున్నాను.

గోవిం—ఔరంగజేబు రాజ్యకాంక్షచే క్రౌర్యము సలిపిన

మాట నిజమే. కాని, యాతఁడు పండితుఁడు—విద్యాప్రియుఁడట!—హిందూమతద్వేషి యగుటచేత నా పాండిత్యము నాతఁడు మన్నింపకున్నను, నిన్ను ద్వేషింపఁడని తోఁచుచున్నది—

న్యూట—ఈ కాలసర్పము నీడ నెవ్వఁడు నివసింపఁగలఁడు. ఈశార్దూలము నోడిలో నెవ్వఁడు నిద్రింపఁగలఁడు?

గోవిం—నేనును, కాశీయాత్ర చేయఁ దలఁచియున్నాను. చచ్చునందాక విశ్వేశ్వర దర్శనము, అన్నపూర్ణా ప్రసాదము—

న్యూట—ఆహా! ఎన్ని హత్యలు మన కన్నులయెదుట జరిగినవి?

గోవిం—మీర్ జుమ్లాకూడ—ఆసామునందు మరణించినాఁడట—

న్యూట—ఇప్పుడౌరంగజేబు మార్గము మరింత నిష్కంటకమైనది.

గోవిం—ఇప్పటికెందఱు మరణించిరో మీకు లెక్కయున్నదా?

న్యూట—ఏదీ చెప్పుము; నీకు లెక్కయున్నదో—

గోవిం—పదిమంది మరణించినారు—

న్యూట—అబ్బ! ఎంత భయంకరము! లెక్కగూడ వేసినారే! ఎవరెవరు?

గోవిం—మొదటివాఁడు సాదతుల్లాఖాన్—రెండు—ధనసింగు—మూఁడు, ముంతాజ్ మహల్—నాలుగు షుజా—ఐదు వైద్యుఁడు—ఆరు అష్మాక్—ఏఁడు దారా—ఎనిమిది ఖాజీ

డా—పది మురాదు—ఇఁక చావనున్న కారా
ఁదలి చక్రవర్తితో పసునొకండుగురు—
బ్బబ్బ! ఇట్టిభయానక రాజ్యారోహణ చరిత్ర
నే నెక్కడనుఁ జూడలేదు.

(ఒక గాయకుఁడు ప్ర॥)

గోవిం—అయ్యా! ఎవరు మీరు?—

గాయ—అయ్యా! నేనొక గాయకుఁడను.

గోవిం—విచారముతో నున్నటులున్నారే! ఆలంఘీరుబాదూషా—సరస్వతీ కుచద్వయితము గోసివేసెనా? మీరును మాతో సమానమైతిరా?

గాయ—అయ్యా! నాక్షోభ నేమని చెప్పుకొందును? ఔరంగజేబు సంగీత ద్వేషముచేత గాయకుల నందఱను, పురము వెడలి పొమ్మనినాఁడు.

గోవిం—అయ్యా! ఎందరని పురమువదలి పోఁగలరు?

గాయ—అందులకే, ఏమియుఁదోఁపక విచారించుచున్నాము.

గోవిం—నేనొక యుక్తి చెప్పెదను చేసెదరా?

గాయ—అయ్యో! చేసెదరా యనుచున్నారా? అంతకన్న మాకుఁ గావలసినదేమున్నది?

గోవిం—"సంగీత విద్య మరణించి" నదనిదుఃఖించుచు మీరొక పాడెవంటిది నిర్మించి శ్మశానమునకు మోసికొనిపొండు—అది యలంఘీరు కంటఁబడవలయును. అందువలన, మీ సంగీతవిద్య కంతముగలిగినను, మీకీపురమున స్థానము దొరుకును.

"అలంఘీర్ పాలన.,,]

గాయ—కానిండు. ఈ యుపాయముచే నలంఘీరు మరలెనా — మంచిదే! — కాదా—మాకందఱకుం యాత్రయున్నదే—

గోవిం——ఈ వంకకు రాజభటులు వచ్చుచున్నారు. మన మటు పోవుదము రండు—

(అందఱు ప్రస్థానము.)

దృశ్యము—౩.

ప్రదేశము—షాజహాన్ చెఱ.

ప్రవేశము—షాజహాన్, జహానారా, కొందఱు పరిజనులు—

సమయము—తెల్లవాఱు జాము.

జహా—నిర్యాణకాలము సమీపించినటులున్నది. షాజహాన్ జీవిత మహానాటక భరత వాక్యమును, ఆలంఘీరు పరిపాలన రూపక నాందీవాక్యమును ప్రకృతి నిర్విచారముగఁ బాడనున్నది!— ఈ గానమునం దమేయశక్తియున్నది... ...ఇప్పటి వఱకు—దుఃఖమును దిగమ్రింగి పితృచరణ సేవనమున కాలము గడిపితిని—నేటితో నాపుణ్యమూర్తి సయితము కాలగతినందుచున్నాఁడు!—ఇఁక నాకేదిగతి!— గతి యేమున్నది! పరమేశ్వరుఁడే గతి!—ప్రకృతి విషాదచ్ఛాయ దరిజేరనీయకుండ నున్నంతదనుక—నేనానందమయినేయగుదును-ప్రవాహ వేగమున, గలసికొని-ప్రవాహవేగ హేతువుననే, విడిపోవు వివిధ ప్రదేశాగత కాష్ట సంచయములవలెనే—ప్రాణులు కలియుచున్నవి—విడిపోవుచున్నవి.— సంపూర్ణమగు నైక్యభావము—భావములకే గాని—శరీరములకు లేదు. అట్లయిన నిమ్మృణ్మయ శరీరములకై మానవులు దుఃఖింపనేల?— అవివేకము—భావములు చాలును— భావించుటయందు మేళనముగలదు— భావనమునందానందముగలదు—భావనమునందు సుఖముగలదు—భావనమే ప్రేమ— భావనమే భక్తి— భావనమే భగవంతుఁడు—

కారాగృహమునఁ బడవేసినది — పాపము
తము— దుఃఖము—మరణము—
జహా—దుఃఖమేల?—భగవచ్చింతచేసికొనుఁడు.
షాజ—అమ్మా! — తెల్లవారవచ్చుచున్నది. కోడికూత వి
వచ్చుచున్నట్లున్నది చూఁడు—
జహా—ఆఁ!—కాకులు కూయుచున్నవి.
షాజ—మృత్యుదేవత నన్నుపిలుచుచున్నది. బేకీ! దిక్కులు—
తెల్లబారుచున్నవి — దీపము—నాకంటికెట్లో యున్నది—
కఫము—గుండెల కెగదట్టినది......శ్వాసలుకూడ— మును
పటికన్న—నధికమైనవి—తెల్లవాఱు సంధిలో నా జీవములు
పోవును— అమ్మా! ఆ తాజ్‌మహల్ వైపు గవాక్షము
తెరచి రమ్ము. (జహా తెరచుచు)
షాజ—తెల్లవారినది—అదే తాజ్‌మహల్— తాజ్‌మహాలే
నా ముంతాజ్ గోరీ—బిడ్డా—నీవిది మఱువఁగూడదు—
నా శరీరము నయితేమందు స్థాపింపఁబడవలెను.—అదిగో
నీవేడ్చుచున్నావు—ఏడువకు—జహా! నాబిడ్డా! నీ వొక్క
తెవు నాకక్కఱకు వచ్చితివి! అట్టి నీకిక—నేగతి గలుగను
న్నదో—నేనెఱుఁగను— మనక్షోభము—అబ్బా ఏమిః?-
వాటిమాటికి—నా కన్నులలో— నాజనకుఁడు జహాంగీరు
చెఱసాలలో బంధింపఁబడిన విగ్రహము— స్పష్టముగఁ
గనఁబడుచున్నది— ఆహా - ఆపాపమే - ఆకుమముగ
నాపాపమేయిది. అధఃపతనము— నాకిదుము— జము—
ఉత్తమగతి యిఁక నాకు లేదు—! అహా చూ. ఖ—

౧:౩౪ ఖు.

...పాపమిది.,,]

... కుమారులారా! రోషనారా! ఔరంగజేబ్
...రి! నన్నెంతజేసితిరి— గుండెలలో శ్లేష్మము
...న్నది. గుఱక బయలుదేరినది. బిడ్డా— జహానారా!
జహానారా!! జహాన్ ... (మరణవేదనపడుచుండును)

జహా—హా! హా! అయిపోయినది! షాజహాన్ చక్రవర్తి జీవితమైపోయినది! తండ్రీ! తండ్రీ— భగవధ్ధ్యానము చేసికొనుము... లాయిలాహా ఇల్లిల్లాహా మహమ్మద్ రసూలిల్లాహా— తోబాతోబాతోబా—

షాజ—లాయిలాహా ఇల్లిల్లా—హా మహమ్మద్రసూలిల్లాహా— తోబా—తోబా—తోబా......

(మరణించును)

తెరవ్రాలును

సప్తమాఙ్కమ్

# పరిశిష్టము.

---

[ప్రవేశము—యోగినియగు జహానారా ఒంటరిగ,—]

జహా—ఆనందమయమైన గీతము— ఈ గీతమును నా శా మహానుభావుఁడు సంగీతముతో నేర్పినాఁడు— ఈ గీతమునే పాడుకొందును— మేఘ మండలాంతరమునుండి నా వంకకు తొంగిచూచు నా ప్రభూ!— నా సంగీతము నాలకింపుము—

पूरी–आदि

जीवा! समझो! तेर पतनहेतू।
पीवो! हमेषा प्रेमसुधारस ॥ जी ॥

पापविचारतो बारबारमतु।
ममताभरती मायप्रपंचमे ॥ जी ॥

कह तेरापित? कह तेरासुत?
कह तेराहित? गां कहाँहा ॥ जी ॥

जनन जननमे जोजो बांधव।
मिलते जाते झूटाहै सब ॥ जी ॥

दौलत छोडो सूरत छोडो।
आश पाश लता बंधन छोडो ॥ जी ॥

दुनिया पर सबु मरनेवाला।
क हु मतभूलो मतवाला ॥ जी ॥

# గేయము.

## పూరికల్యాణి— ఆది.

౧. జీవా! సమఝో! తేర పతనహోంతు।
పీవో! హమేషా ప్రేమసుధారస ॥ జీ ॥

౨. పాపవిచారతో వారబారమతు।
మమతా భరతీ మయ ప్రపంచమె ॥ జీ ॥

3. కహా తేరాపిత? కహా తేరాసుత?
కహా తేరాపింత? గామ్ కహాం హాం ॥ జీ ॥

౪. జనన జననమే జోజో బాంధవ।
మిలతే జాతే ఘూంటాహై సబ ॥ జీ ॥

౫. దౌలత ఛోడో సూరత ఛోడో।
ఆశపాశ లతా బంధన ఛోడో ॥ జీ ॥

౬. దునియాపర సబ్ వర నేవాలా।
ఏ తూ మతునూలో పతువాలా ॥ జీ ॥

सम्पूर्ण.

# భారతీమండలి.

## బెజవాడ.

---

ఇందు సుప్రసిద్ధ కవివరులచే రచియింపఁబడిన, నవలలు, నాటకములు, ప్రకృతి శాస్త్రములు, దేశచరిత్రములు, పురాణములు, ప్రబంధములు, ప్రతిగ్రంథమును 200 పుటలకు మించకుండ చిత్రపటములతో నెల కొకటి చొప్పున ప్రకటింపఁబడును.

శాశ్వతచందాదారులకు క్యాలికో బైండు చేయఁబడిన మా ప్రచురములను ఒక రూపాయి వెలకు పంపుదుము.

ఇతరులకు— రు. 1-4-0.

అనుబంధ గ్రంథములను చందాదారులు, విధిగా స్వీకరింపవలయును.

మా గ్రంథములు భాషాంతరీకృతములుగాని, అనుకరణములుగాని, గాక, స్వకపోల కల్పితములుగానుండును.

చందాదారులకు ప్రవేశ రుసుము లేదు.

రాజపోషకులు:—ఇచ్ఛాధీనము.

పోషకులు:—రు. ౫౦.

సహాయులు:—రు. ౩౦.

☞ చందాదారులుగాఁ గోరువారు క్రింది చిరునామాకు వ్రాయవలెను.

బ్రిటిషు రాజ్యమునకు:—

కార్యదర్శి, భారతీ మండలి, బెజవాడ.

నైజాము రాజ్యమునకు:—

కార్యదర్శి, భారతీ మండలి, కల్లూరు.
మధిర తాలూకా, N. G. S. Ry.,

౧౨౮

# భారతీమండలి.

## బెజవాడ.

ప్రథమ గ్రంథము—వెలువడినది.

# తాజ్ మహల్

చిత్రపటశోభితము—క్యాలికో బైండు ౨౦౦ పుటలు.

చందాదారులకు, పోస్టేజిగాక—రు. ౧—౦—౦.

ఇతరులకు పోస్టేజిగాక,—రు. ౧—౮—౦.

రాఁబోవు గ్రంథము అచ్చులోనున్నది.

# రాజగోపాలము

ఇది యాంధ్రదేశ సంబంధమగు సాంసారిక నవల. ఇందు మన దినదిన కృత్యములు—మూఢాచారములు—ప్రపంచమునందలి వివిధప్రకృతులు—మనోహరముగ వర్ణింపఁబడినవి. చిత్రపట శోభితము క్యాలికో బైండు ౨౦౦ పుటలు.

గ్రంథకర్త,

సోమరాజు రామానుజరావు.

చందాదారులకు పోస్టేజిగాక రు. ౧—౦—౦.

ఇతరులకు పోస్టేజి గాక, రు. ౧—౮—౦.

ప్రథమానుబంధము—వెలువడినది.

# హత్యావిచారము

(నిరూపక నవల) అత్యద్భుత కథా విలసితము. క్యాలికో బైండు చేయబడినది. ౧౦౦ పుటలు.

గ్రంథకర్త,

"దాసు."

చందాదారులకు రు. ౦—౮—౦.

ఇతరులకు రు. ౦—౬—౦.

౧౪౬

కార్యదర్శి,

భారతీ మండలి, బెజవాడ.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA110B106 |
| పుస్తకం పేరు | తాజ్ మహల్ |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 185 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ch.Ramya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Nounika |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |